

Chandamama, October '50

Photo by B. Ranganadham

"ఓ, మీరేనా?"




వస్తోంది!

విజయ వారి...

# పాతాళ భైరవి

దర్శకుడు - K.V. రెడ్డి, B.Sc (Hons)

నిర్వాహకులు - నాగిరెడ్డి :: చక్రపాణి...



ఈ సంచికలో యివి
చదువుకోండి

| విషయము | | పేజి |
|---|---|---|


ఇవన్నీ గాక బొమ్మల పజిలు,
ముగ్గులు, చిక్కు బొమ్మలు,
ఇంకా, ఇంకా ఎన్నో వున్నై.

చందమామ ఆఫీసు
పోస్టుబాక్సు నెంబరు. 1686
మద్రాసు.1.

# చందూయొక్క సాహసకృత్యములు











చందుయొక్క సాహసము.






# దీపావళి ఆకర్షణ



మామూలుకంటె ఎక్కువ పేజీలతో, ఎక్కువ రేఖా చిత్రాలతో, మరెన్నో త్రివర్ణ చిత్రాలతో, చక్కటి కథలు— మనోహరమైన గేయాలు — గిలిగింతలు పెట్టే చిక్కు సమస్యలు— ముచ్చట గొలిపే ముగ్గులు—మొదలయిన అనేక అందచందాలతో



## హిందీ చందమామ
## దీపావళి (నవంబరు) సంచిక



వెలువడబోతున్నది. ఇన్ని ఆకర్షణలతో అలరారుతున్నా, సంచిక వెల

## మామూలు 6 అణాలే



ఉపేక్ష చేసినట్టయితే మీకు ఈ ప్రత్యేక సంచిక దొరక్కపోవచ్చు. కాబట్టి, మీ కాపీకోసం ఇప్పుడే మీ ఊరి ఏజంటుతో చెప్పి వుంచండి.

---

**చందమామ పబ్లికేషన్సు**

పోస్టుబాక్సు 1686 :: మద్రాసు 1

**FOR PLEASANT READING & PROFITABLE ADVERTISING:**

## Chandamama Group

**(HINDI, TELUGU, TAMIL & KANNADA)**

**EVERY MONTH ADORNS**

**92,500 HOMES**

*and*

***Enchants Ten Times the Number of Readers throughout India***



**Group Page Rs. 350**



*Enquire :*

**P. O. BOX 1686, MADRAS-1**




# రు. 500 బహూమానము

## ఉమా గోల్డు కవరింగు వర్క్సు

ఉమా మహల్ :: మచిలీపట్నము

ఉమా గోల్డు కవరింగు వర్క్సు పోస్టాఫీసు.




అసలు బంగారు రేకు లోహముపైన అంటించి (Gold Sheet Welding on Metal) తయారు చేయబడినవి. కాదని రుజువు చేసినవారికి రు. 500 బహుమానమివ్వబడును. మేము తయారు చేయు ప్రతివస్తువు ప్యాకింగు పైన "ఉమా" అను ఇంగ్లీషు అక్షరములు గుర్తించి కొనవలెను. బంగారు వన్నె 10 సంవత్సరములు గ్యారంటి.







* * *



పరీక్ష చేయగోరువారు ఉమా ఆభరణములను మహాద్రావకములో వేసిన 5 నిమిషములకే బంగారము రేకు వెడలివచ్చును. ఈ విధముగా పరీక్ష చేసినవారు అనేకమంది మాకు సర్టిఫికేట్లు ఇచ్చియున్నారు. 300 డిజయినులు గల క్యాటలాగు ఉచితముగా పంపబడును. ఇతర దేశములకు క్యాటలాగు ధరలమీద 25% అధికము.






*N.B.*—వస్తువుల వి. పి. పార్శిలు చార్జి 0-15-0 మాత్రమే అగును.

Tel: "UMA" MASULIPATAM.

---

# మిత్రాంజనం




మిత్ర ఫార్మసీ - తెనాలి

---

# సోలార్ పెన్స్




శాస్త్రి పెన్ వర్క్సు - తెనాలి




మీ
ప్రియమైన
పానీయము

పరిమళ భరితమైనది

పండిత డి. గోపాలాచార్యులవారి

స్వర్ణోత్సవము

1898 - 1948

# జీవామృతం







ఆరోగ్యానికి
బలానికి

ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్, మదరాసు 17.

# అట్టమీది బొమ్మ

క్రువలయపీడనమనే యేనుగను సంహరించిన తరువాత కృష్ణ బలరాములు కోట ద్వారాలవద్ద నిలబడి వేడుకలు చూస్తూవున్నారు. నిండు దర్బారు కలకల్లాడుతూ వుండగా అల్లంత దూరాన కంసమహారాజు సింహాసనం అధిష్ఠించి వున్నాడు. మహారాజుకి ఎదురుగ్గా గొప్ప మల్లయుద్ధరంగం ఏర్పాటయింది. అతి వైభవంగా నిర్మించబడిన ఆ రంగమందు ముష్టికుడు, చాణూరుడు మొదలైనటువంటి ముష్టియుద్ధవీరులు తయారుగా వున్నారు. వీరి విద్యలుచూచి ఆనందించటానికని జనం కిట కిటలాడజొచ్చారు.

ముష్టికుడు ద్వారంవేపు తిరిగి వెటకారంగా "ఓయి కృష్ణా! బలరామా!!— మీరు చూపులకు పిన్నలేకాని, నిజంగా ఎంత గొప్పవాళ్ళోయ్. మీబలం ఎటువంటిదో మన కంసమహారాజావారు చూచి మెచ్చుకుంటారట. ఏది, రండి! మాతో ఒక్కసారి కుస్తీపట్టి మమ్మల్ని ఓడించండి" అంటూ కయ్యానికి కాలు దువ్వాడు.

కృష్ణ బలరాములు చూస్తే ముష్టికుని పిడికిట్లో యిమిడిపోతారన్నమాట. వానితో ఈ పసిపాపలు పోరాడటమా? ఎంత విడ్డూరం! ఇందులో ఏదో మాయ వున్నదని అందరూ భయపడ్డారు. కాని అది మహారాజావారి ఆజ్ఞ.

చాణూరునితో కృష్ణుడూ, ముష్టికునితో బలరాముడూ తలపడి అత్యద్భుతంగా పట్టుపట్టారు. కృష్ణ బలరాములు—సూటిచూసి ఒక దెబ్బ, ఒక గుమ్మిక్కుపోటు యిచ్చి గభీమని పట్టీ కొట్టించినప్పుడల్లా ముష్టిక చాణూరులు పర్వతాలలాగా నేలనుపడి 'అమ్మో!' అంటూవుండేవాళ్ళు. కొంతసేపు వినోదంగా పట్లు పట్టిన తరువాత బాలకృష్ణుడు చాణూరుని చేతులూ కాళ్ళూ కలిపి పట్టుకొని బంతి ఎగరవేసినట్టు ఆకాశంమీదికి విసిరాడు. వాడు అమాంతం భూమిమీద తాటిపండులాగ పడి, 'కృష్ణా! కృష్ణా!!' అంటూ ప్రాణాలు విడిచాడు. ముష్టికునికి ఇదేగతి పట్టింది. తరువాత వరుసగా కూట, శీల, తోసలకులనే యోధులుకూడా కృష్ణ బలరాముల చేతిలో మృతి పొందారు.

# చందమామ

## పిల్లల కథల మాసపత్రిక

సంచాలకుడు, చక్రపాణి

ఇంచుమించు మున్నాట
అరవై రోజులూ మనకు పండుగలూ,
పబ్బాలే! పండుగ అంటే మన జీవితంలో ఒక కొత్త
వెలుగును చూపే పర్వం అన్నమాట. ఇటువంటి పర్వాలలో
మన పూర్వులు ఎన్నో గొప్ప ఉద్దేశాలను యిమిడ్చి వున్నారు.
వచ్చేది దీపావళి పండుగకద? ఈ పండుగనాడు అచరించే పనులద్వారా
మనం ధైర్యాన్ని అలవరచుకోవటం పెద్దల ముఖ్యోద్దేశం అని అనుకోవచ్చు.
ఈనాడుకూడా పల్లెటూళ్ళలో ప్రజలు పోర్లీలుకట్టి బాణాసంచా కాల్చటం మనం
ఎరుగుదుం. కాల్చేటప్పుడు చూస్తే వారి ధైర్యమూ, సాహసమూ నిజానికి ఆశ్చర్యం
కొల్పుతయి. ఇదొక యుద్ధరంగమా! అని కూడ అనిపిస్తుంది. పోతే — ఇటువంటి
పనులు చేయటానికి పౌరుషమే ప్రధానం. పౌరుషంతోనే వస్తుంది ధైర్యం. ఇలా చిన్న
ప్పుడు పిల్లలు భయపడకుండా బాణాసంచా కాల్చటం నేర్చుకుంటే, పెరిగి పెద్దవా
ళ్ళయాక స్వభావసిద్ధంగానే వారు యుద్ధవీరులు కావటానికి వీలుంది. దేశానికి
రక్షణ కావాలంటే ఇటువంటి శూరులూ వీరులే అగత్యమై వుంటారు. అలాగని,
అపాయకరమైన మందుసామానులతో పిల్లలు చెలగాటమాడుతూంటే చూస్తూ
వూరుకొనమని కాదు. నిరపాయకరమైన పద్ధతిలో బిడ్డలు బాణాసంచా
కాల్చటానికే ఎల్లప్పుడూ ప్రోత్సహించాలి కాని వాళ్లకు పిరికిమందు
పోయటం ఎంతమాత్రమూ మంచిది కాదు. ఈవిధంగా
జరిగిననాడే మన పెద్దల సంకల్పాన్ని మనం
నెరవేర్చిన వాళ్ళమవుతాం.



సంపుటి 7
సంచిక 4

అక్టోబరు
1950







# మేలుమరువని సింహం

పూర్వకాలపు బానిసొక్కడు
మోయజాలక బ్రతుకు బరువును
పారిపోయెను కారు కోనకు
ఒక్కరాతిరి వీడి ప్రభువును.

అలసి, ఆకలి దప్పికలచే
సొలసి కానక శరణు మెందున
చేరబోయె బిరాన నొక గుహ
కాంచి ఇంచుక దూరమందున.

ఇంతలో నొక కంటి సింహము
బాధ నోపక ముక్కి మూలిగి
గోండ్రుబెట్టుచు నడువసాగె
నతని దిక్కుకు నిక్కి నీలిగి.

జడిసి, అసువుల ఆశ బాసియు
నిలచె నాతడు చెమట నించుచు
బానిసత్వపు బాధకంటెను
మరణమే మేలని తలంచుచు.

కాని చిత్రము సింహమాతని
వద్ద నిలచెను పాదమెత్తుచు
ముల్లు నొక్కటి చూచి అతడు
తీసివేసెను పుండు నొత్తుచు.

రచన:
'బైరాగి'

నొప్పి తగ్గెను, వెడలిపోయెను
సింహమెంతో సంతసముతో;
కొంతకాలము గడపె నాతడు
వనమునందే నీరసముతో.

అంతలోనే వెదుకుకొనుచూ
ప్రభువు పంపిన భటులు వచ్చిరి;
వాని నొక అధికారి వద్దకు
విరచి రెక్కలు కట్టి తెచ్చిరి.

సింహమున కెరగా విధించెను
అతని కా అధికారి దండన;
పట్టి గోదాలోన విడిచిరి
బోను తలుపులు తీసిరయమున.

కాని సింహము గ్రామసింహము
కంటె హీనముగా అతనిగని
తోక ఆడించుచు ముదముతో
వచ్చి వాలెను పదములందున.

మేలు మరువగలేని సింహము
తెలిపె నవ్విధితో కృతజ్ఞత;
చకితుడై అధికారి అతని
విడివిపుచ్చెను కరుణతోడుత.







# కాసుల వాన!

[రచన: "మహేశ్వర్"—మద్రాసు]

అనగనగనగా కథ చెప్తానూ
అందరు విని ఊకొట్టండీ!

రకరకాల ఐల్ కాయలు కాచే
రంగు రంగులా పూవులు పూచే
కిలకిలమంటూ పక్షులు కూసే
రమ్యమైన తోటున్నాది
ఆ తోటను ప్రభువులు పెంచారు

గల గల మని రాసులు రాసులు
ధగ ధగ మని మెరిసే కాసులు
తోటంతా కాంతులు నిండీ
ప్రతిరోజూ పడతాయండీ

రాజుగారు చూచేరండీ
ఆశ్చర్యం ముంచిందండీ
బంగారపు వానలు కురిసే
రాసులుగా కాసులు పోసే
దేవతలో ఎవరో ఏమో
తెలియలేదు ఒక్కరికైనా

అందమైన అంతఃపురమూ
అంతులేని వింజామరమూ
విడిచిపెట్టి వచ్చేరండీ
రాజుగారు ఒంటరిగానూ
తోటలోను కాసేరండీ

కోడి కూత కూయక మునుపే
కువ కువ మని గానం చేస్తూ
ధగ ధగ మని మెరిసే వెన్నెల
తోటంతా జిగ జిగ మంటూ
వచ్చిన దొక వింత విహంగం
కువ కువ మని కూతలు కూయగ
గల గలమని కాసులు రాలెను

రాజుగారు పన్నిన వలలో
మరునాడే పడింది పక్షి
రతనాలూ కెంపులు నిండిన
నగిషీల్ మరి జిబుగులు చెక్కిన
పంజరాన బంధించేరూ

పండ్లు మిఠాయిలు పెట్టేరండీ
పలురకాలుగా చూచేరండీ
ఉలుకూ లేదూ పలుకూ లేదు
ఊసుకైన ఒక కాసూ లేదు

స్వేచ్ఛలోను ఉండే హాయిని
హరించేరు రాజావారూ
మంత్రిగారు ఆలోచించి
పక్షి నొదిలి పెట్టేరండి—అది
రివ్వు రివ్వు మంటూ ఎగిరి
కువ కువ మని గానం చేసే
గల గల మని కాసులు రాలె

# చెవుల పండుగ

కొవ్వూరులో కోదండపాణి అనే ధనవంతుడొకాయన ఉండేవాడు. ఆయనకు మామిడిపళ్ళంటే చాలా ఇష్టం. తన యింటికి సమీపంలోనే కొంత భూమి అమ్మకానికొస్తే కొని, అందులో రకరకాల మామిడి మొక్కలు దేశ దేశాలనుంచి రప్పించి నాటించాడు. స్వయంగా దగ్గరుండి మొక్కలకు నీళ్ళు పోయించి, అవి ఎప్పుడు ఎదిగి కాయలు కాస్తాయా, ఆ కాయలు ముగ్గవేసి, ఎప్పుడు పళ్ళు తింటామా అని ఎదురుచూచేవాడు.

తోటలో చెట్లన్నింటికీ ముందుగా ఒక్క ఇమాంపసందే కాపు కట్టింది. అది అపురూపంగా రెండే రెండు కాయలు కాసింది. వాటిని ఏ చిలకలూ కొట్టెయ్యకుండా కాపాడుతూవచ్చి ముదిరి పక్వానికొచ్చాయని తేలటంతోనే కోదండపాణి వాటిని కోసుకొచ్చి ముగ్గవేశాడు. మొదటి కాపు గనక ఆ కాయలు బాగా పెద్దవిగా ఉండి, పచ్చగా ముగ్గి ఎంతో మనోహరంగా కనపడ్డాయి.

కోదండపాణికి సుబ్బయ్య అనే ఒక వంటవాడు తప్ప, పెళ్ళాంగాని, బిడ్డలుగాని ఎవరూ లేరు. ఆ మామిడి పళ్లు కోసుకున్నాడు ఎవరినైనా ఆప్త మిత్రుణ్ణి పిలిచి, ఆ ముక్కలతో విందు చెయ్యాలని అతనికి అనిపించింది. కనుక జానకిరామయ్యను పిలుచుకొద్దామని బయల్దేరి అతడు సగందూరం వెళ్ళేటప్పటికి, ఒక పరదేశి ఎదురయాడు. అతని ముఖం ఎక్కడో చూచినట్లు తోచింది. కోదండపాణి ఆలోచించటం మొదలెట్టి, ఎప్పటికీ గుర్తురాక, 'ఏమండీ, మీదేవూరు?' అని అడిగేడు.

ఆ వచ్చినాయన వచ్చీరాని తెలుగులో తనది కాశీ అని చెప్పేడు. చెప్ప

కె. వి. సుబ్రహ్మణ్యస్వామి, తంజావూరు



డమేకాకుండా అతను కోదండపాణిని గుర్తుపట్టి, 'కోదండ్‌పానీ! అచ్ఛా!' అన్నాడు. కోదండపాణికికూడా అతనెవరో గుర్తుకొచ్చింది. తను కాశీవెళ్ళి అక్కడ నెల్లాళ్ళున్నప్పుడు, వాళ్ళింటిపక్కనే బస చేశాడు తను. అతని పేరు గోవర్ధనపంతు. 'ఏం ఇలావచ్చావ్?' అని అడిగేడు కోదండపాణి. గోవర్ధనపంతు 'దక్షిణదేశం యాత్రలకి వచ్చాన'ని చెప్పేడు. కోదండపాణికి పంతు అంటే ఎక్కడలేని ప్రేమా పుట్టుకొచ్చి, అతనిని తన యింటికి తీసుకుపోయి ఆ మామిడిపండు ముక్కలు అతనికే పెడదామనిపించింది. అందుచేత జానకిరామయ్య ఇంటికి వెళ్ళటం మానేసి పంతును వెంటబెట్టుకుని, తన యింటికి చక్కా వచ్చాడు.

పంతుని సావిట్లో కూచోబెట్టి, తన పడక గదిలో బీరువాలో దాచి ఉంచిన ఆ రెండు మామిడిపళ్లూ తీసి వంటింట్లో ఉన్న సుబ్బయ్య చేతికిచ్చి, 'సుబ్బయ్యా, ఈ పళ్ళు రెండూ చెక్కు తీసి చక్కా ముక్కలు కోసి, ఒక వెండికంచంలో సగం నాకూ, మరో వెండి కంచంలో సగం వారికీ వేసి తీసుకురా' అని చెప్పి, సావిట్లోకి వచ్చి, గోవర్ధనపంతుతో ఆప్యాయంగా బాతాఖానీ మొదలెట్టేడు.

సుబ్బయ్య తన సొంత చాకుతో మామిడిపళ్ళ చెక్కు తీసి ముక్కలుకోసి నోరు ఊరటంచేత ఉండబట్టలేక ఒక్క పండుముక్క నోట్లో వేసుకుని తినేశాడు. దాని తస్సాగొయ్యా. ఆ పండుముక్క ఎంతో రుచిగా ఉండటంచేత సుబ్బయ్యకి మరోముక్క నోట్లోవేసుకో బుద్దేసింది. మరొహటల్లా ఇంకొకటీ, ఇంకొకటల్లా వేరొకటీ ఐ, సావిట్లో ఉన్న ఆ ఇద్దరి మాటా మరిచేపోయి, సుబ్బయ్య రెండు కంచాలలో ముక్కలూకూడా ఒక్కటైనా



మిగల్చకుండా 'గుటకాయి స్వాహా' చేసేసి ఊరుకున్నాడు.

వంటవాడు ఎప్పటికీ వెండి కంచాలలో పళ్ళముక్కలు పట్టుకు రాకపోయేసరికి కోదండపాణి వంటింటికేసి వెళ్ళి 'సుబ్బయ్యా, ముక్కలు కోశావా?' అన్నాడు. సుబ్బయ్య, "ఏం కొయ్యేదం బాబూ నా మొహం! మొండివాడి ముక్కులైనా తెగని మొద్దుకత్తులాయిరి మనింట్లో!' అంటూ, చెక్కపేళ్లు చీల్చటంవల్ల మొనపోయిన చాపాటికత్తి ఒకటి తెచ్చి కోదండపాణికి చూపెట్టేడు. కోదండపాణి వొళ్ళు మండి, 'కత్తి పదునుగా లేదని కూచున్నావా, అవతల పెద్దమనిషి కనిపెట్టుకుంటే?' అంటూ, ఆకత్తి పుచ్చుకుని చరచరా దొడ్లోకి వెళ్ళి సన్నెకల్లుమీద పెట్టి పరపరా నూరటం మొదలెట్టేడు.

అతడు పెరట్లోకి వెళ్ళగా చూసి సుబ్బయ్య సావిట్లో కిటికీవద్ద నిలపడి అక్కడ ఏమీతోచక దిక్కులు చూస్తూ కూచున్న గోవర్ధనపంతుతో 'ఇలారండి' అని సౌంజ్ఞ చేశాడు. పంతు 'ఎందుకు చెప్మా?' అనుకుంటూ లేచి కిటికీవద్దకు వెళ్లేడు. సుబ్బయ్య దూరంగా పెరట్లో కత్తి నూరుతున్న కోదండపాణిని పంతుకి చూపించి, 'దేఖో దేఖో!' అన్నాడు.

పంతు 'క్యా? క్యా?' అంటూ కిటికీలోంచి చూసి. 'అయన కత్తి నూరుతున్నాడెందుకూ?' అని హిందూస్తానీలోనే అడిగేడు.

సుబ్బయ్య 'ఉత్త వెఱ్ఱివాడివిలా వున్నావే! నిన్ను ఈయన ఇక్కడికి ఇంత ఆప్యాయంగా ఎందుకు తీసుకొచ్చాడో ఇంకా నీకు బోధపడలేదా? రోజూ ఇలాగే ఎవడో ఒక పరదేశిని లాక్కొచ్చి, చెవులు రెండూ కోసేసి అమ్మవారికి నైవేద్యం పెడుతుంటాడు. ఈవేళ నీ ఖర్మం కాలి ఈయనకు నువ్వు దొరికేవు. ఆ కత్తి నూరటం

తోనే, వచ్చి నీకా చెవులపండుగ చేసేస్తాడు' అన్నాడు. ఆమాట వినటంతోనే గోవర్ధనపంతు, ఇది దక్షిణాదిని ఒక ఆచారం కామోసనుకొని బేజారై పరుగుచ్చుకున్నాడు.

పంతుని కొంతదూరం పోనిచ్చి, సుబ్బయ్య పెరట్లో ఉన్న కోదండపాణికి వినపడేట్టు 'దొంగ, దొంగ' అని అరవటం మొదలెట్టాడు. నూరుతూ, నూరుతూన్న కత్తితో కోదండపాణి సావిట్లోకి పరుగెత్తుకొచ్చి, 'ఎక్కడరా దొంగ?' అన్నాడు.

'అడుగో, మీరు స్నేహితుడంటూ తీసుకొచ్చిన ఆ పరదేశీ! మామిడిపళ్లు రెండూ పట్టుకుని పారిపోతున్నాడు!' అన్నాడు.

ఆమాట వినటంతోనే కోదండపాణి, 'అయ్యో, రెండూ పట్టుకుపోతున్నాడా?' అంటూ, వీధిలోకి పరుగెత్తి, 'ఓయ్యోయ్ పంతూ, ఒక్కటి! ఒక్కటి నన్ను కోసుకోనియ్యి!' అంటూ గోవర్ధనపంతు వెంటబడ్డాడు. దూరాన పరుగెత్తిపోతూన్న పంతు, 'ఒక్కటి! ఒక్కటి!' అంటూ కత్తి పుచ్చుకుని తరుముకొస్తూన్న కోదండపాణిని చూసి, 'అరే, బద్మాష్! ఒక్క చెవి కోసుకోనిమ్మంటావా? చెవికాదు చెవిమీద రోమమైనా తాకనివ్వను! ఎంత ద్రోహం తలపెట్టేవ్? ఈ మాటు కాశీరా చెప్తా. కళ్ళు రెండూ పీకి గంగలో పారేస్తాను' అని కోపం వెళ్ళగక్కుతో, ఇంకా వేగంగా పరుగెత్తసాగాడు.

కోదండపాణి కొంచెం లావుపాటి మనిషి కావటంచేత వాడి పరుగు అందుకోలేక, మొదటికాపు రెండుమామిడిపళ్ళల్లో తనకు ఒక్కటీ దక్కకపోయెనే అని విచారిస్తూ, ఇంటికి తిరిగివచ్చాడు. ఈలోగా సుబ్బయ్య టెంకలు రెండూ తీసుకుపోయి దొడ్లో గోతిలో కప్పెట్టి వచ్చి, చక్కా కూర్చున్నాడు. ఈవిధంగా పాపం, కోదండపాణి నోట్లో కరక్కాయ పడింది.






4

[సారంగమార్గంద్వారా రాజు, సుహాసినిని వెంటబెట్టుకుని భూగృహానికి బయలుదేరటం, వాళ్ళకి దాది ఎదురురావటం, ఆతర్వాత వాళ్ళు దారితప్పిపోగా రాజు వాళ్ళని సారంగంలో వదిలి తిరిగి వచ్చేసరికి వాళ్ళు మాయం కావటం, అప్పుడు రాజు దారితెలియక అలా ఆ సారంగంలోనే తిరగులాడుతుండటం వరకూ క్రిందటిసారి చదివారుకదూ?]

ఇంతలోకే ఒకచోట ఒక ద్వారం కనిపించింది. అక్కడ దాదీ, సుహాసినీ కనిపించేసరికి రాజుకి ప్రాణం లేచివచ్చింది. ద్వారం గుండా లోపలికి పోయేసరికి అది తన సుహాసిని పడకగదికి చేర్చింది. ఈ వింత సారంగాన్ని గురించిన రహస్యం ఏమిటా అని చూడగా, సుహాసిని గదిగోడలకి చుట్టూ ఎక్కడా సందులేకుండా పైకప్పు నించి కింద నేలవరకూ అద్దాలువున్నై. ఆ అద్దా లన్నింటిలోకీ ఒక అద్దం చాల విచిత్రమైంది. నేలమీద ఒకచోట ఒక చిన్న మీట వుంది. దానిని నొక్కితే ఆ అద్దం నేలలోకి దిగిపోయి అక్కడ ఒకద్వారం ఏర్పడుతుంది. ఆ ద్వారమే సారంగంలోకి దారితీసింది. గదిలో వున్నట్టుగానే, ద్వారం దాటగానే సారంగం మొదటిలో కూడా ఒక చిన్న మీట వున్నది. అది నొక్కితే అద్దం మామూలుగా పైకివచ్చి ద్వారం మూసుకుపోతుంది. మళ్ళీ మీట నొక్కితే అద్దం భూమిలోకి దిగిపోయి ద్వారం కనిపిస్తుంది.

ఐతే, సుహాసిని రాజుగదికి ఎలా చేరుకున్నదీ? అనే ప్రశ్న ఒకటుంది. మామూలు ప్రకారంగా దాది సుహాసినిని తన పక్కలో

పడుకోబెట్టుకుని నిద్రపోతున్నది. ఒక రాత్రివేళ సుహాసినికి మెలుకువ వచ్చింది, ఏమీతోచక గదిలో అటూ ఇటూ తిరుగుతుండగా సుహాసిని కాలు అక్కడ నేలమీద వున్న మీటపైన పడింది. వెంటనే అద్దం భూమిలోకి దిగిపోవటం అక్కడ ద్వారం తెరుచుకోవటం జరిగింది. ఈ వింత చూచి సుహాసిని సొరంగంలో ప్రవేశించి నడవగా, అది చివరికి రాజు శయనాగారంలో పటం వెనుకకు చేర్చింది. చీకటిగా వుండటంచేత అక్కడివరకే సొరంగం ఉన్నదనీ, అది దాటి మరొక్క అడుగువేస్తే అక్కడ పటం వుందనీ సుహాసినికి తెలియలేదు. ఇంకా పోదామని ముందుకు నెట్టుకుపోయే సరికి పటం సందిచ్చి, ఆ సందులోంచి నిద్రిస్తున్నరాజు కనిపించాడు ఆమెకు. తక్షణమే సుహాసిని తండ్రివద్దకు పోవాలనే ఆత్రంతో ఎన్నో శ్రమలుపడి బ్రహ్మాండమైన ఆ పటాన్ని ఒత్తిగించింది. ఆ తరవాత రాజు ఈ వింతసొరంగంలో ఎలా చిక్కుకొనే తిరుగులాడ జొచ్చాడో మీరు చదివే వున్నారు.

ఈ విధంగా వింతసొరంగంయొక్క రహస్యమార్గం గురించి తెలుసుకున్న






తర్వాత రాజుకి ఒకవంక సంతోషమూ మరోవంక భయమూకూడా కలిగినై. ఎవళ్లకంటా పడకుండా ఎలాగో భయపడుతూ భయపడుతూ రాజు ఈనాటివరకూ తోటలోనించి భూగృహానికి వస్తూ పోతూ వున్నాడు. ఇప్పుడు ఈ సొరంగ రహస్యం తెలియటంవల్ల ఆ భయం తీరిపోయింది. యిష్టంవచ్చినప్పుడల్లా తన గదినించి బ్రహ్మరుద్రులకు తెలియకుండా భూగృహంలోకి వచ్చి తన పిల్లల్ని చూచుకోవచ్చు. ఈ అదృష్టానికి రాజు ఉప్పొంగిపోయాడు.

కాని ఇప్పుడు రాజుకి మరొక భయం పట్టుకుంది. తగిన కట్టుబాటు చెయ్యకపోతే యిప్పటిలాగే యికముందుకూడా సుహాసినిగానీ, మిగతా పిల్లలుగానీ ఈ సొరంగంలోనించి తనగది చేరుకోవటం, అక్కడనించి బైటి ప్రపంచంలోకి రావటం జరగవచ్చు. అంతటితో తన జాగ్రత్త ఎందుకూ పనికిరాకుండా పోయి పిల్లలు దక్కకుండా పోవచ్చు. అలా జరగకుండా వుండటానికి ఉపాయమేమిటా అని రాజు అదేపనిగా ఆలోచించసాగాడు. చివరికి ఒక ఉపాయం తట్టింది. అది యేమిటీ అంటే:

ఇంతకుముందు తన ముగ్గురు కుమార్తెలకు భూగృహంలో మూడు గదులు విడివిడిగా ఏర్పాటుచేసి ఒక్కొక్కరిని ఒక్కొక్క దాది సంరక్షణలోవుంచాడు. కాని ఇకమీదట ఈ మీట వున్నగదిలో ఎవరు సంచరించినా, తను తలచినట్టుగా ప్రమాదాలు కలగవచ్చుననే వుద్దేశంతో ఆ గది ఖాళీగా ఉంచటానికే రాజు నిశ్చయించాడు. తన ముగ్గురు కుమార్తెలను తక్కిన రెండు గదులలోనే వుంచి కాపాడుతుండమని దాదులను హెచ్చరించాడు. వాళ్ళు అలాగే అన్నారు. అప్పటికి రాజు మనసు కుదుటబడింది. కొంతసేపు ముగ్గురు




కుమార్తెలతోనూ ముచ్చటలాడి, తర్వాత ఇంతకుముందు సుహాసిని వుంటున్న అద్దాల గదిలోకి వచ్చాడు. మీటమీద కాలువేసేసరికి అద్దం భూమిలోకి దిగిపోయి ద్వారం ఏర్పడింది. ద్వారంగుండా సొరంగంలోకి వచ్చి తిరిగి అక్కడవున్న మీట కాలితో నొక్కేసరికి మళ్లీ ద్వారం మూసుకున్నది.

ఈ రహస్యమార్గం వున్నట్టు ఎలాగో తనకు తెలియజేసిన దేవుడికి నమస్కరిస్తూ రాజు సంతోషంగా తిరిగి తనగదిలోకివచ్చి చేరుకున్నాడు.

* * *

ఆనాటినించీ రాజు భూగృహంలోకి ఎన్నోసార్లు ధైర్యంగా వెళ్లి వస్తూవున్నాడు. క్రమంగా రోజులు గడుస్తున్నయ్. కాని తండ్రి తమని చూడటానికి వచ్చినప్పుడల్లా రాకుమార్తెలు ముగ్గురూ, తండ్రి కాళ్ళని చుట్టేసుకుని "మేముకూడా నీతో వస్తాం నాన్నా" అని జాలిగా అడిగేవాళ్లు.

కాని వాళ్ళను తనతో తీసుకువెళ్ళగల ధైర్యంలేదు రాజుకి. అందుకని "ఇప్పుడు కాదమ్మా, మరొకసారి తీసుకువెడతాలే" అని సమాధానపరుస్తుండేవాడు.

క్రమంగా నెలలు దొర్లిపోతున్నై. ముగ్గురు కుమార్తెలూ సురక్షితంగా పెరుగుతున్నందుకు రాజు మురిసిపోతున్నాడు. కాని అక్కడ రాణీ, ఒక్కొకరోజు గడిచిన కొద్దీ బెంగతో కృంగి కృశించి పోతున్నది. ఏమంటే పిల్లల్ని వెతుక్కుంటూ వెళ్లిన నౌకర్లలో చాలమంది తెల్లమొగం వేసుకుని తిరిగి వచ్చేశారు. మధ్య మధ్య రాణీ జ్యోతిష్కుణ్ణి పిలిపించి— "స్వామీ పిల్లలు క్షేమంగా వున్నట్టేనా?" అని అడుగుతుండేది.

"వున్నారమ్మా. పిల్లలేకాదు, వాళ్ళని వెతుకబోయిన ఆ వందమంది నౌకర్లు,



పిల్లలవెంట వెళ్ళిన దాసీలూకూడా క్షేమంగానే వున్నారు. మీరేమీ దిగులుపడకండి. కొద్దిరోజుల్లో అందరూ క్షేమంగా తిరిగి వచ్చే సూచనలు జాతకంలో స్పష్టంగా కనిపిస్తున్నయ్" అని చెబుతుండేవాడు జ్యోతిష్కుడు. అలా చెప్పినపుడు మనస్సులో తృప్తిపడి కొద్దిరోజులవరకూ రాణీ మళ్ళీ నిశ్చింతగా వుండేది.

ఈవిధంగా మరి రెండు సంవత్సరాలు గడిచినై. భూగృహంలోకి రహస్య సొరంగంద్వారా రాజు రోజూ వెళ్లి కుమార్తెలను చూచివస్తున్నాడు. బిడ్డలుముగ్గురూ సురక్షితంగానే వున్నారు. కాని రాజు భూగృహంలోకి వెళ్ళినప్పుడల్లా పిల్లలు తమని బయటికి తీసుకువెళ్ళమని గోలచేస్తూనే వున్నారు. "మమ్మల్ని యిక్కడ ఎందుకు వుంచావు నాన్నా? అమ్మని చూడాలి. అమ్మ దగ్గిరికి తీసికెళ్లూ..." అని ఏడుస్తూ తండ్రి కాళ్ళు చుట్టేసుకునేవారు. వాళ్ళు అలా కన్నీరు కారుస్తూ వుండటం చూచినప్పుడల్లా రాజు గుండె తరుక్కుపోయేది. "పోనీ ఒక్కసారి తీసుకపోయి పిల్లల్ని రాణీకి చూపించుదామా?" అనిపించేది. కాని అలా చేయటానికి ధైర్యంచాలేది కాదు. 'ఏమైనా సరే ఈ ఒక్క యేడాపే చలించకూడదు' అని నిశ్చయించుకున్నాడు. అందుచేతనే పిల్లలు ఎంత ఏడ్చినా, ఏదోవిధంగా వాళ్ళని సముదాయించుకొంటూ కాలం వెళ్ళతోస్తున్నాడు.

ఇలా మరికొన్నాళ్లు గడిచింది. మరొక్క నాలుగు రోజులకల్లా పిల్లలకు ఏడేళ్ళూ నిండుతై. ఆనాటికి గండాలు గడిచి వాళ్లు భూగృహంనించి విడుదల కావచ్చు. "ఇప్పటివరకూ ఈ మూడుసంవత్సరాలలో పిల్లలకి ఏవిధమైన అపదా రాకుండా భూగృహంలో సురక్షితంగా కాపాడగలిగానే, ఇక నేముంది. నాలుగురోజులు కాస్త




జాగ్రత్తగా వుంటే నాలుగేళ్ళూ నిండుతై. జాతకరీత్యా నా బిడ్డలు ప్రమాదంలేకుండా బ్రతికి బయటపడతారు" అనుకొన్నాడు.

యథా ప్రకారం రాజు ఒకనాటి ఉదయాన్నే రహస్యమార్గం ద్వారా పిల్లల్ని చూడటానికి వచ్చాడు. బిడ్డలు భూగృహంలో ఉండవలసిన గడువు ఆనాటితో తీరిపోతుంది. పిల్లలు తండ్రిని చూడటంతోనే కాళ్ళకి చుట్టేసుకుని "ఈ వేళ మమ్మల్ని బైటికి తీసుకువెడితే కాని వీల్లేదు" అని పట్టుబట్టి మారం చేస్తూ కూచున్నారు. బిడ్డల దుఃఖం చూచి రాజు మనస్సు కరిగిపోయింది. "ఈ మూడు సంవత్సరాలూ ఏ ఆపదా రాలేదు కదా? ఇంకొక్క ఇరవైనాలుగు గంటలలో ఏమి రాబోతుంది? పైగా, ఇంతమంది పరివారం కాపుదలవుండగా అలాంటిది ఎలా జరుగుతుంది?" అని మనస్సుకు ధైర్యం తెచ్చుకుని, పిల్లలు ముగ్గురనూ వందమంది నౌకర్లూ, ముగ్గురు దాసిలతోసహా భూగృహంలోంచి తోటలోకి తీసుకవచ్చాడు. ముగ్గురు పిల్లల్నీ దాసీలకి వప్పగించి తనూ వాళ్ళదగ్గిరే కూచున్నాడు. వందమంది నౌకర్లూ చుట్టూతా కాపలా వున్నారు. ఇన్నాళ్ళకు మళ్లీ బయటి ప్రపంచం చూడగానే పిల్లలు ఎంతో సంతోషంగా గంతులు వేస్తూ ఆడుకుంటున్నారు. వాళ్ళ ఆటలు చూచి రాజు ఎంతో మురిసిపోతున్నాడు.

ఇంతలో ఉన్నట్టుండి ఒక్కసారిగా బ్రహ్మాండమైన సుడిగాలి వచ్చింది. ఆ ప్రదేశమంతా దుమ్ముతో నిండింది. అక్కడ ఉన్నవాళ్ళంతా ఒక్కక్షణం కన్ను మూశారు. మళ్లీ కళ్లు తెరిచేసరికి మూడు గద్దలు వచ్చి ముగ్గురు పిల్లల్నీ ఎత్తుకపోవటం మాత్రం కనపడింది వాళ్లకు. రాజు స్మృతి తప్పి పడిపోయాడు. దాదులు రాజుకి పరిచర్య చేస్తున్నారు.

నౌకర్లు వందమందీ ఆ గద్దలు పోయిన వైపుకి పరుగెత్తారు.

రాజుకి స్పృహ వచ్చి "నవుకర్లుఏరీ ?" అని అడిగేటప్పటికి, సరిగా అప్పుడే వాళ్లు ఒకరివెంట ఒకళ్లు తెల్లమొగాలు వేసికొని తిరిగి రావటం జరిగింది.

సరీగా మూడుసంవత్సరాల క్రిందట రాజు ఏ కల్పితవాక్కులు పలికి కపట నాటకం ఆడాడో అది ఈనాడు అక్షరాలా తన కళ్లఎదట జరిగేసరికి రాజు తనని తాను తిట్టుకున్నాడు.

"ఈనాడు యిలా జరగవలసి వున్నది గనుకనే ఆనాడు ఏవో దుష్టగ్రహం నాలో ప్రవేశించి నాచేత అటువంటి అశుభ వాక్కు పలికించింది. అందుకనే 'నుదుట వ్రాయనిదే నోట పలికించ'దని అంటారు పెద్దలు" అనుకొంటూ రాజు కంటికి మింటికి ఏకధారగా దుఃఖించసాగాడు. ఐతే విధివిలాసము ఎలా ఉన్నదో ఆప్రకారమే జరిగింది. నిజానికి, అతీతమైన శక్తి యేదో ప్రేరేపించటంవల్లనే రాజుకి మనస్సు యొక్క కట్టుదిట్టం తప్పి, బిడ్డలను తోట లోకి తీసుకపోదామనే బుద్ధిపుట్టింది. జరగ వలసిన ప్రమాదమేమో జరిగింది. తీరా యిప్పుడు చేతులు కాలినతర్వాత ఆకులు పట్టుకొందామనుకుంటే ఏమి లాభం ?

ఇకనిప్పుడు రాణీదగ్గిర ఈ విషయం దాచవలసిన పని యేముందీ? రాజు పరివారంతోసహా మహలు చేరుకుని, చెప్పలేక చెప్పలేక ఈ వైనం రాణితో చెప్పాడు. ఇంకేమున్నది, రాజూ రాణీకూడా దుఃఖ సముద్రంలో మునిగిపోయారు.

---

[ఆటువంటి కఠోరవార్త విన్నతర్వాత రాణీ యిదివరకులాగే ఈసారికూడా బ్రతికిందా? గద్దలు తన్నుకుపోయిన ఆ ముగ్గురు పిల్లలూ ఏమయారు? ఈవిషయాలు వచ్చేనెల చదవండి.]






పూర్వం వెంకటప్ప అనే అతను జాంబవంతుణ్ణిగూర్చి తపస్సుచేశాడు.

ఐనా, జాంబవంతుడుమాత్రం వెంకటప్పకు ఓ పట్టాన్ని ప్రత్యక్షం కాలేదు. ఏమంటే, 'వెంకటప్ప' అన్నవాడొకడు తనకోసం అంత ఘోరమైన తపస్సు చేస్తున్నాడనే సంగతే ఆతనికి తెలియదు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులైతే ఎక్కడ ఎవరెవరు తపస్సు చేస్తున్నారో తెలుసుకుని, ప్రత్యక్షమై వరము లివ్వటానికి సిద్ధంగా ఉండివుందురు. కాని జాంబవంతుడికి అలాంటి అలవాటు లేదుగనక వెంకటప్ప తపస్సునుగూర్చి తెలుసుకోటానికే కొంత అలస్యమైంది. తెలిశాక మాత్రం జాంబవంతుడు క్షణంకూడా జాగుచెయ్యక వెళ్లి వెంకటప్పకు ప్రత్యక్షమయ్యాడు.

వెంకటప్ప కళ్లు తెరిచి ఎదురుగా ఉన్న జాంబవంతుణ్ణి చూసి, సాష్టాంగపడి నమస్కారంచేస్తూ, వచనంలోనే స్తోత్రం చేయ నారంభించాడు:

'భల్లూకేశ్వరా, నీవు బ్రహ్మదేవుడు ఆవులించినప్పుడు, ఆయన నోటిలోనుంచి పుట్టుకువచ్చిన మహానుభావుడవు. చిరంజీవివి. రామావతారంలో భగవంతునికి తోడ్పడి భక్తాగ్రేసరుడ వనిపించుకున్నావు. కృష్ణావతారంలో ఆ భగవంతుడికి మామగారివే అయావు. నన్ను నీ దాసునిగా చేసినది, పాదములు మొదలు శిరస్సువరకూ ఉండే నీ వెంట్రుకలే! నీ రోమసంపదకు మురిసిపోయే నేను ఈ తపస్సు చేశాను! ఈ వరము నాకోసం కాదు. నా మేనమామ 'హరప్ప'ను గురించి. కోరుకోమన్నావుకదా అని నాకు పేరాసలేదు. మా మామయ్యకు ఆ చెవిలో ఒక దుబ్బు, ఈ చెవిలో ఒక దుబ్బు రోమములు ఉండేటట్లు అనుగ్రహించితివంటే చాలు" అని ప్రార్థించాడు.

బి. గురుసిద్దప్ప, హొసూరు



జాంబవంతుడి ఆశ్చర్యానికి అంతు లేక పోయింది. ఎంత ఆలోచించినా వెంకటప్ప ఉద్దేశమేమిటో జాంబవంతుడికి బోధపడక, "ఓ భక్తుడా, ఇలాంటివరం కోరుకోడంలో నీ ఉద్దేశం ఏమిటి?" అనిఅడిగాడు.

"స్వామీ, అది చాలా రహస్యమైన సంగతి, క్షమించాలి. మీకైనాసరే వెల్లడి చెయ్యటం నాకు ఇష్టం లేదు." అంటూ బదులుచెప్పాడు.

"పోనీ చెప్పవద్దులే. నీవు కోరినప్రకారం నీ మేనమామ రెండు చెవుల్లోనూ దుబ్బుగా జుట్టు పెరిగేటటు చేస్తాను!" అని చెప్పి జాంబవంతుడు అంతర్ధానమైనాడు.

వెంకటప్ప సంతోషంతో తన వూరు తిరిగివచ్చాడు. తల్లీ తండ్రీ వాణ్ణిచూసి బ్రహ్మానందభరితులై 'నాయనా, ఇంత కాలం ఎక్కడికి వెళ్ళావురా? అకాత్తుగా మాయమైపోయావే? చెప్పరా' అంటూ అనేకవిధాల అడిగేరు.

వెంకటప్ప 'చెప్తాగాని మామయ్యేడీ?' అంటూ ఆత్రంతో అడిగాడు.

"నీకోసం ఊరూ వాడా వెతికి వెతికి, కనపడలేదని ప్రాణం విసిగి ఇవాళే తిరిగి వచ్చాడు. అలిసిపోయి పడుకున్నవాడు ఇంతవరకూ లేవనేలేదు." అన్నది తల్లి.

వెంకటప్ప గబగబ హరప్ప పడుకున్న చోటికి వెళ్ళి రెండు చెవులూ పరీక్షించి చూశాడు. ఏంచెప్పను? జాంబవంతుడి వరం ప్రకారం, హరప్ప రెండుచెవుల్లోనూ, వెంట్రుకలు దుబ్బుగా ఎదిగివున్నాయి! వాటిని చూచి వెంకటప్ప ఆనందంతో ఆ దుబ్బులురెండూ ఒకమాటు చేతితో తడిమి చూసి, ఉబ్బి తబ్బిబ్బులైనాడు. వెంకటప్ప గంతులెయ్యగా ఆ చప్పుడికి హరప్పలేచి, "ఎవరూ, వెంకటప్పేనా? ఎక్కడనుంచి ఊడిపడ్డావురా? ఏమిటా గంతులూ, కేకలూను?' అని అడిగాడు.

"మామా, నీ చెవులలో దుబ్బులకు మల్లే మొలిచిన ఆ వెంట్రుకలు చూచుకు మాటాడవయ్యా!" అన్నాడు వెంకటప్ప.

"వెంట్రుకలా?" అంటూ హరప్ప చెవులు తడుముకోగా, అవి చేతికి తగిలినై. 'ఇదేమిటి?' అని అతను విస్తుపోయాడు. వెంకటప్ప తలితండ్రులుకూడా "ఇవెలా వచ్చాయి?" అంటూ నివ్వెరపోయూరు.

అప్పుడు వెంకటప్ప, "హరప్పమామా, నీ చెవులలోని దుబ్బులముందు, ధనప్పగారి మామ గురవప్ప వెంట్రుకలకు ఏంపోలిక? అతగాడి వెంట్రుకలకన్న నీరోమాలు రెట్టింపుఎత్తు, రెండు రెట్లు పొడవూనూ! దీన్నిబట్టి ఆలోచించు! రెండు రెళ్లు నాలుగు, నాలుగు రెళ్ళు ఎనిమిది! ధనప్ప ఐశ్వర్యానికి ఎనిమిదిరెట్లు ఐశ్వర్యం! అనగా అష్ట ఐశ్వర్యాలున్ను!" అంటూ ఎగరటం మొదలెట్టేడు మళ్లీ.

"ఎవడికిరా, అష్ట ఐశ్వర్యాలున్నూ?" అని ప్రశ్నించాడు మళ్లీ హరప్ప.

"ఎవరికేమిటిమామా? నాకు! గురవప్ప చెవిదుబ్బులద్వారా ధనప్పకి ఐశ్వర్యం అబ్బుతుంది కదా, మరి?" అన్నాడు వెంకటప్ప.



మేనమామల చెవులలోని వెంట్రుకలకూ, మేనల్లుళ్ళ ఐశ్వర్యాలకూ ఉండే సంబంధమేమిటో హరప్పకు బోధపడక ధనప్పను అడిగి తెలుసుకుందామని బయల్దేరేడు. కాని కొత్తగావచ్చిన తన చెవులలోని దుబ్బులుచూసి ప్రతీవాడూ, 'ఇవేమిటి?' అని అడుగుతాడేమో అనే భయంతో చెవులు కనపడకుండా అంగాస్త్రం ఒకటి చుట్టుకుని, ధనప్ప ఇంటికి వెళ్ళి, 'ధనప్పా! ఈమధ్య నా మేనల్లుడు వెంకటప్ప ఎక్కడికో పోయి వచ్చాడు. వచ్చినప్పట్నుంచీ, గురవప్ప చెవులలో ఉండే వెంట్రుకల దుబ్బులద్వారా నీకు

ఐశ్వర్యం వచ్చినట్లుగా నా చెవులలోని దుబ్బులద్వారా తనకు ఐశ్వర్యం వస్తుందని అదే ఎగరటం ఎగురుతున్నాడు ఏమిటీ దీని అర్థం?" అన్నాడు.

"నీ చెవుల్లోనూ దుబ్బులున్నాయా?" అని అడిగాడు ధనప్ప వింతగా.

"ఇదివరకు లేవు కాని, నిద్రలేచి చూసుకునేసరికల్లా ఎలావచ్చాయో, రెండు చెవులకూ దుబ్బులు మొలిచాయి" అంటూ, హరప్ప అంగవస్త్రం విప్పేసి చెవులు చూపించాడు. ధనప్ప చూసి ఆశ్చర్యపోయి. "హరప్పా, జరిగిన సంగతి విను: మీ వెంకటప్ప ఒకరోజున వచ్చి 'ధనప్పా, నీకింత ఐశ్వర్యం ఉన్నదే, దీనంతకీ కారణం ఏమిటి? అని' అడిగాడు. "మా పెద్దలు కష్టపడి సంపాదించి ఇచ్చారు. నేను దాన్ని వృద్ధిచేసుకుంటూ వస్తున్నాను' అని చెప్పేను. కాని వెంకటప్ప ఈ సమాధానంతో తృప్తిపడక, రోజు రోజూ వచ్చి వేధించటం మొదలుపెట్టేడు. 'ఏదోఒకటి చెప్పి వీడి పీడ వదిలించుకోవాలి' అని ఆలోచిస్తూంటే మా మామ గురప్ప అలా వెడుతూండటం తటస్థించి, అతని చెవులలో ఉన్న దుబ్బులు నా కంట పడ్డాయి. 'చూడు వెంకటప్పా. నా ఐశ్వర్యానికంతకీ కారణం ఆ దుబ్బులే!' అన్నాను. ఆమాట కాస్తా చెవిని వేసుకుని వెళ్ళి, వెంకటప్ప. అరాత్రే మాయమయాడు. ఇంతకూ నీ చెవులలో ఈ దుబ్బులు రావటం చిత్రంగా ఉన్నదే?' అన్నాడు. హరప్ప ఇంటికి తిరిగివచ్చి, వెంకటప్పను బుజ్జగించి, అడిగేసరికి జాంబవంతుణ్ణి గురించి తపస్సుచేసి, వరం సంపాదించిన సంగతి వెల్లడించాడు.

తనకు ఐశ్వర్యం వస్తుందని వెంకటప్ప చాలాకాలం ఎదురుచూశాడు. కాని తాను తపస్సుచేసి మామకు సాధించిపెట్టిన దుబ్బుల ఐశ్వర్యంతప్ప మరేమీ రాలేదు.






వెలగదుర్రు గ్రామంలో వెంగలరాయడనే ఒక గొప్ప వస్తాదు ఉండేవాడు. అతడు ఉత్త పోగరుబోతు అవటంవల్ల, ఆగ్రామస్థులందరికీ అతడంటే భయంగా ఉండేది. వాళ్ళని యేడిపించటానికి అత డొక్కడూ చాలడన్నట్టు, అతగానివద్ద ఒక కుక్క కూడా ఉండేది. కుక్క అంటే సామాన్యమైన కుక్క కాదది. పగలు చూస్తే రాత్రి కలలోకి వచ్చేటంత భయంకరంగా ఉండేది! అత డెప్పుడూ దాన్ని కట్టివేసేవాడే కాదు. 'ఇలా వదిలేస్తే ఎలాగయ్యా? పిల్లవాళ్లు జడుసుకుంటున్నారు. అదీగాక, ఎవళ్లనన్నా కరిస్తే ప్రమాదం. గొలుసు వేసి కట్టెయ్యండి' అని ఇరుగు ఇంద్రయ్యా పొరుగు పేరయ్యా చెప్పి చూశారు గాని, 'వీళ్లు చెప్పటం, నేను వినటమూనా?' అన్న అహంకారంతో వాళ్ల మాటను అంగీకరించాడుకాదు రాయడు. 'ఈ శని ఎలా విరగడౌతుందిరా భగవంతుడా!' అని అని పంచేది వాళ్ళందరికీ.

ఇలా ఉంటూండగా, ఆ గ్రామంలో చెఱువు త్రవ్వటానికని ఉప్పరివాళ్ళ జట్టు వచ్చి దిగింది. గునపాలూ, పారలూ, తట్టలూ పుచ్చుకుని ఆ ఉప్పర్లు వెంగళరాయడున్న వీధినిబడి పోతూంటే, వాళ్లని చూచి రాయడి కుక్క మొరుగుతో పరుగెత్తుకొచ్చింది. జట్టులో వెనక నడుస్తూన్న వీరేశు ఆ జాగిలాన్ని అదలించబోయాడు కాని, అది ముంగాళ్ళు పైకెత్తి వెనకకాళ్ళ మీద నిలబడి, కండలు తేరిఉన్న వాడి బుజాన్ని నోటితో పీకబోయింది. వాడు ఒక్కక్షణం ఆలస్యం చేసిఉంటే తోడేలు లాంటి ఆ కుక్క ఆవేళ వాడి మాంసాన్ని రుచిచూచి ఉండేదే! వీరేశు మెరుపుతీగ లాగ తప్పించుకుని, మళ్లీ మీదకు ఉరకబోయే కుక్క మొహంమీద వాడిగా ఉన్న

డి. చంద్రకాంతమ్మ, కాకినాడ




తన గునపంతో ఒక్క పోటు పొడిచాడు. జాగిలానికి బలమైన గాయం తగిలి, బల బల రక్తం కారటం మొదలెట్టింది. అది మొరుగుతో రాయుడివద్దకు తోక ముడుచుకు పరుగెత్తింది.

కుక్కనొసట కారే రక్తాన్ని చూసి, రాయుడు ఉగ్రుడైపోయాడు. మూలనున్న చాపాటి కర్రను చేతబుచ్చుకుని గబగబా వీధిలోకి పరుగెత్తుకొచ్చి, 'కుక్కను పొడిచినది ఎవర్రా?' అంటూ గర్జించాడు. 'నేను!' అంటూ వీరేశు ముందుకి వచ్చాడు. రాయుడు తన కర్రను ఎత్తి బలంగా ఒక్క మోదుమోదేడు. వీరేశు తన గునపం అడ్డుబెట్టి ఆ దెబ్బ కాసుకున్నాడే గాని లేకపోతే వాడు తల పగిలి చనిపోవలసినవాడే. వీధిలో జరుగుతోన్న గల్లంతు విని ఇరుగు పొరుగువాళ్ళంతా వచ్చి మూగేరు. రాయుడు కోపం ఆపుకోలేక పిచ్చి కుక్కకుమల్లే ఎగిరిపడుతో మళ్ళీ కర్రను ఎత్తేడు. ఈ మాటు ఉప్పర్లందరూ తమ గునపాల వాడిమొనలను వాడి పీకెవద్దకు పోనిచ్చారు. వీరేశు 'కర్రదింపు, లేకపోతే పొడిచేస్తాం. ఆతర్వాత మాచేతిలో పని గనక ఇక్కడే గొయ్యితీసి, నిన్నూ నీ కుక్కనూ అందులో కప్పెట్టి మరీ పోతాం. కపడ్దార్!' అన్నాడు.

రాయుడికి జరిగిన పరాభవానికి లోలోపల సంతోషిస్తో ఇంద్రయ్యా పేరయ్యా చోద్యం చూస్తో నిలబడిపోయారేగాని రాయుడి పక్షాన పలికి ఉప్పర్లను అదలించారు కారు. ఇంతలో రాయుడిపెళ్ళాం లోపల్నుంచి పరుగెత్తుకొచ్చి, 'నా మొగుణ్ణి చంపెయ్యకండర్రోయ్!' అంటూ గోల పెట్టేసరికి ఉప్పర్లందరూ తమ గునపాలను బుజాలమీదకు మళ్ళించుకుని చెఱువు త్రవ్వవలసిన చోటికి చక్కాపోయారు. రాయుడు ఇంట్లోకి పోయి

'కుక్కని గునపంతో పొడిచాడని ఉప్పరి వాడిమీద కేసుపెట్టి శిక్ష వేయిస్తా'నన్నాడు. 'జరిగిందేదో జరిగింది. మాటాడక ఊరు కోండి' అంది రాయడు భార్య. కాని కసితో దహించుకుపోతూన్న రాయడు తక్షణమే వెళ్ళి, ఉప్పరి వీరేశుమీద ఫిర్యాదుచేసి వచ్చాడు.

కేసు విచారణ చెయ్యటానికి మేస్త్రీటు గారు వెలగదుర్రులోనే మకాం వేశారు. కేసూ పోలీసులూ అంటే ఉప్పర్లందరూ భయపడ్డారు. వీరేశుమాత్రం, 'న్యాయం మనపక్షాన్ని ఉందర్రా. భయం ఎందుకు?' అన్నాడు. 'ఏం న్యాయమో! శిక్షపడితే ఖైదులోకి పోతావ్!' అన్నారు వాళ్ళు. 'శిక్ష పడదర్రా. అంతగా పడితే పడనివ్వండి. ఇక్కడ తవ్వే గోతులే అక్కడే తవ్వి, వాళ్ళు పెట్టే కూడు రుచిచూచి వస్తాను. బయ టుండి మహా సుఖపడిపోతున్నాంగనక నా?' అన్నాడు. వాళ్ళంతా వీరేశు ధైర్యా నికి మెచ్చుకున్నారు. ఊరువూరంతా కచ్చేరీ సావిడివద్ద మూగేశారు. మేస్త్రీటు 'ఏం వీరేశూ, నువ్వు రాయడుగారి కుక్క మొహంమీద గునపంతో పొడిచి గాయపరి చావుట కదా, నిజమేనా?' అని అడిగేరు.



'నిజమేనండి బాబయ్యా!' అని వప్పు కున్నాడు వీరేశు.

'అయితే నోరులేని జంతువుని ఇలా ఎందుకు పొడిచావు? రాయడుగారు యీ జాగిలాన్ని నూరు రూపాయిలిచ్చి కొన్నా రట. రోజూ రెండుశేర్ల మాంసం, శేరు పాలూపోసి ఎంతో ముక్కువగా పెంచుకుం టున్నారట. అలాంటి కుక్కని నీవు నిష్కా రణంగా పొడిచి, చచ్చేటంత గాయం చేశావే?' అన్నారు.

అందుకు వీరేశు, 'ప్రభువులవారు చిత్త గించాలి. నేను ఈ జాగిలాన్ని నిష్కార ణంగా పొడవలేదు. అది నామీదపడి కరవ

పోతూంటే, ప్రాణం రక్షించుకోటానికని గునపంతో కాసుకున్నాను' అన్నాడు.

మేస్ట్రీటుగారు పిలవకుండానే రాయుడు కూచున్న చోటునుంచి ఉబ్బెత్తుగా లేచి, 'అయ్యా, ఇది అబద్ధం. ప్రాణం రక్షించుకోటానికే వీడు తన గునపాన్ని ఎత్తేడనుకుంటే, గునపం పదునుగా ఉన్న వైపు పెట్టి కాసుకోడం ఎందుకు? తిరగేసి కాసుకోవలసింది. అప్పుడు ఆ భాగం నా కుక్కకి తగిలినా, గాయం పడకపోయి ఉండును' అన్నాడు.

ఆమాట విని వీరేశు నవ్వుతో, 'ప్రభూ, వీరి జాగిలం నన్ను నోటితో కరవటానికొచ్చింది గాని తోకతో కరవటానికి రాలేదు. అది నోటితో బదులు తోకతో కరవటానికొస్తే నేను నా గునపాన్ని తిరగేసే కాచుకొని ఉందును!' అన్నాడు.

వీరేశు సమాధానం వినేటప్పటికి మేస్ట్రీటుగారికి ఫక్కున నవ్వొచ్చింది. ఆయన నవ్వటంతోనే కచేరీలో హాజరైన వాళ్ళంతా విరగబడి నవ్వటం మొదలెట్టేరు. ఒక్క నవ్వనివాడల్లా రాయుడే.

మేస్ట్రీటుగారు వీరేశు తెలివికి మెచ్చుకుని 'రాయుడూ, నువ్వు చెప్పేదేమీ సబబుగా లేదు. ఆపదసమయంలో గునపాన్ని తిరగేసి కాసుకోవాలా, ఆమట్టునే కాసుకోవాలా అని ఎవరూ ఆలోచిస్తూ కూచోరు. అలా ఆలోచిస్తోవుంటే నీ జాగిలం వీరేశు మీదపడి పీకేసే ఉండును. ఇకనైనా నీ కుక్కని వదిలెయ్యక, గట్టి గొలుసుతో కట్టేసి ఉంచు' అని శాసించాడు.

'వీరేశూ, నిన్ను వదిలేశాను వెళ్ళు' అన్నాడు. సంతోషంతో వీరేశూ, మొహం ముడుచుకొని రాయుడూ కచేరి విడిచి వెళ్ళిపోయారు. వీరేశుకు పడతాయనుకున్న సంకెళ్ళు జాగిలానికి పడటంతోనే, ఇంద్రయ్యా పేరయ్యా నాటితో తమకు శని విరగడైందని సంతోషించారు.






చాలకాలం క్రిందట కాంచనభట్టు అనే ఒక శ్రీమంతుడు ఉండేవాడు. భట్టుకిగల ఐశ్వర్యమెంతో అతనికే తెలియదు. అంతటి సిరిసంపదలతో తులతూగుతూ వున్నప్పటికీ, ఎందుచేతనోగాని అతని మనస్సుకి తృప్తిఅనేది లేకపోయేది.

ఈకారణంవల్ల కాంచనభట్టు—"నాకు ఈలోకంలో అన్ని సౌఖ్యాలూ ఉన్నాయి. ఏ లోపమూ లేదు. కాని, ఏమిలాభం? తృప్తి శాంతీ లేని ఈ జీవితం ఎందుకు వచ్చింది?" అని తలిచి లోలోపల కుమిలి పోతూ వుండేవాడు. ఈ బెంగతో భట్టు నిద్రాహారాలు మానుకొని, కృశించి పోజొచ్చాడు.

ఇలా ఉండగా—ఒకనాటిరాత్రి భట్టుకి ఒక కల వచ్చింది. ఆ కలలో ఒక వృద్ధురాలు కనపడి "ఓయి భట్టూ!—దేవుడు నీకు సమస్తమైన సౌఖ్యాలూ ప్రసాదించినప్పటికీ ఇలా ఆవేదనపడటం దేనికి? ఇక్కడికి సరిగా నలభై ఆమడ దూరంలో కైలాస పర్వతం ఉన్నది. ఆ పర్వతంమీద రత్నాల తోటలో బంగారుకోట వున్నది. ఆ కోటను కాపలా కాసే ఇద్దరు ద్వారపాలకులనూ నీవు మెప్పించగలిగితివంటే, వారు నిన్నుగురించి దేవదూతకు మంచి మాటలు చెప్పి, దివ్యపేటికను యిప్పించగలరు. దానిని నీవు జాగర్తగా ఇంటికి తెచ్చుకుని, దగ్గర ఉంచుకుంటే, నిన్నింతకాలంగా బాధిస్తూవున్న అశాంతీ, అసంతృప్తీ మాయమైపోయి, మనస్సు నిర్మలంగా నిశ్చింతగా వుంటుంది" అని చెప్పి, అంతర్ధానమయింది.

కలలు నమ్మేదేమిటి, అందులోనూ ముసిలిదాని మాటలు చెవిని పెట్టేదేమిటి అనుకొని, కాంచనభట్టు అటునుంచియిటు తిరిగి పడుకున్నాడు. కాని, మరునాడు

యన్. రామమూర్తి, కడప





మళ్ళీ ఆ వృద్ధురాలు కలలో కనపడి "ఏమోయి భట్టూ !—ఇంతా చెబితే నిన్ను కానట్టుగా ఊరుకొన్నావేమిటి? ఇప్పుడైనా లేచి వెంటనే కైలాసపర్వతానికి బయల్దేరు. ఐతే, ఉత్తచేతులు పుకొంటూ వెళితే ఏమీ ప్రయోజనం లేదు. బంగారు కోటను కాపలాకాసే ద్వారపాలకులు ఐశ్వర్యవంతులను మాత్రమే మెచ్చుకొంటారు. కనుక, నీ సంపదలో ఉండే జీవమంతా సమకూర్చి, వారికి సమర్పించితివంటే, వారు సంతోషించి దేవదూతకు నిన్ను గురించి అనుకూలంగా చెబుతారు" అని హితబోధచేసి, అదృశ్యమైంది.

ముసలిదాని మాటలు ఎంతవరకు నిజమో, పోనీ చూదామా అనిపించింది భట్టుకి. ఐనా బద్ధకించి వూరుకొన్నాడు. వృద్ధురాలు ఊరుకోక మళ్ళీ మూడోరోజు కూడా కలలో కనిపించి, వేగిరపెట్టే వరకు ఇంక ఉపేక్ష చేయలేకపోయాడు. ఆ మరునాడే 'ఫలానా కైలాసపర్వతం మీద ఉండే దివ్యపేటికను తీసుకరాగలిగినవాళ్ళకు గొప్ప బహుమతి ఇస్తాము' అంటూ చాటింపు వేయించాడు. కాని, ఎంతకాలానికి 'నేను తీసుకరాగలను' అని చెప్పి ముందుకువచ్చే సమర్థుడు లేకపోయాడు.

ఒకరోజున ఒక బిచ్చగాడు వచ్చి, భట్టును కుశలప్రశ్నలు వేస్తూ, మాటల సందర్భంలో ఆ 'దివ్యపేటికను' సంపాదించే మార్గం తను చూపించగలనన్నాడు. ఈమాటకు కాంచనభట్టు చాలా సంతోషించాడు. తన ఐశ్వర్యమంతటిలో జీవమని చెప్పతగిన మణులూ మాణిక్యాలూ సమకూర్చుకొన్నాడు. నూరు పెద్ద సంచీలు వెండి బంగారాలతో నింపి ఒక వంద ఏనుగులపైన వేయించాడు. ఈ ధనసంపదను కాపాడటానికి ఆ యేనుగులవెంట ఒక







అశ్వ వళం పెట్టాడు. పరివార మంతటికీ ఆరు నెలల వరకూ సరిపడే ఆహార పదార్థాలు సేకరించి, వాటిని మోయటానికి లొట్టి పిట్టలను ఏర్పాటు చేశాడు. తెల్లటి పంచకల్యాణి గుర్రాలను ముత్యాల రథానికి కట్టించి, భట్టు అతి వైభవంగా బయల్దేరాడు.

భట్టూ, పరివారమూ పోయి పోయి, మూడు మాసాలు అయే సరికల్లా ఒక బ్రహ్మాండమైన మైదానం చేరుకున్నారు. మరికొంచెం దూరంలో అపరూపమైన చక్కటి ఉద్యానవనం కనిపించింది. బిచ్చగాడు వారిని అక్కడ ఆపి "భట్టూ!-మీరిక్కడనే ఉండండి. నేను ముందుగా బంగారుకోటకు పోయి, మీరు వచ్చిన సంగతి ద్వారపాలకులకు తెలిపి వస్తాను" అని చెప్పి పోయాడు.

పోయిన బిచ్చగాడు ఎంతకూ తిరిగి రావటం కనపడలేదు. ఇలా ఒకళ్ళకోసం కనిపెట్టుకుని వుండటం భట్టుకి ఇంతకు ముందు ఎప్పుడూ అలవాటులేదు. అందు చేత ఆవేశనపడుతూ, ఏమీ తోచక ఆ చీకటిరాత్రిలో ఒకచెట్టెక్కి కూర్చున్నాడు. ఇంతలో తెల్లవారింది. బాలభానుడు ప్రకాశించగా భట్టుకి మెలకువ వచ్చింది. అతను కన్నులు తెరిచి చూచేసరికల్లా చుట్టూతా ఏమూలచూచినా ధగధగ మెరిసిపోతూ వుంది. సూర్యకిరణాలు అంతకంతకు ఎక్కువగా ప్రకాశించినకొద్దీ, ఆ ప్రదేశమంతా వింత వింత కాంతులతో వెలిగిపోజొచ్చింది.

భట్టు పరికించి చూచాడు—తను ఎక్కి కూర్చున్న చెట్టు బంగారపు చెట్టు. ఆకులు వెండివి. దాని కాయలూ పువ్వులూ రత్న మాణిక్యాలతో పొదగబడినై. ఇది చూడగానే అతనికి మతిపోయినట్టయింది. 'నా ఐశ్వర్యమంతా పోగుచేసినా ఈ



చెట్టులోవుండే ఒక్క కాయ విలవ చేయదే. నేనెంత, నా సంపదయెంత? నేనూ ఒక శ్రీమంతుడనే అని చెప్పుకొనటం సిగ్గుచేటు కూడా. ఇంతకూ, శ్రమపడి నేను గొప్పగా తెచ్చిన ఈ బహుమతులను ద్వారపాలకులు పుచ్చుకుంటారా?' అని ఈవిధంగా మనస్సులో ఆరాటపడజొచ్చాడు.

ఏమైతేకానీ అనిచెప్పి, కాంచనభట్టు చెట్టుదిగి కాలు సాగించాడు. ఎంతదూరం నడిచినా దారిఅంతా బంగారపు మలామా చేసినదే. దారి పొడుగుతా అటుపక్కా యిటుపక్కా ఇటువంటి చెట్లు ఎన్నో కనువిందుగా కనబడుతూనే ఉన్నాయి. కొంతదూరంలో బంగారుకోట కనపడింది. ఆణిముత్యాలతో అతిసుందరంగా కూర్చబడిన ఆ కోటద్వారాలు తెరిచివున్నాయి. భట్టు సరాసరి లోపలికి పోయి ఒక మహలులో ప్రవేశించాడు. మహలు మధ్యని సింహాసనంమీద ఒక దివ్యపురుషుడు కూర్చొని ఉన్నాడు. అతను భట్టును దగ్గరకు రమ్మని పిలిచి, "భట్టూ! నేను నీ స్నేహితుణ్ణే. భయపడక ఇటురా. నీవు 'దివ్యపేటిక'కోసం వచ్చావుకదూ! నా ద్వారపాలకులను మెప్పించడంకోసం నీ సంపదలోని సారమంతా సమకూర్చి తెచ్చావుకదూ!" అన్నాడు. ఈ విషయాలన్నీ ఇతనికి ఎలా తెలిసాయోనని భట్టుకి ఆశ్చర్యం వేసింది. ఆ దేవదూత అప్పుడు ఒక భటుని పిలిచి, కోటగదులన్నీ భట్టుకి చూపించమన్నాడు.

భటుడు అతనిని ఒక్కొక్క గదికే తీసుకవెళ్ళి, వరసగా చూపించాడు. గది గోడలన్నీ వెండివి. కిటికీలు నవరత్నాలతో పొదగబడినవి. ఏమూలచూచినా బంగారం కుప్పలుపోసి ఉన్నది. వచ్చేపోయేవాళ్ళు ఆ బంగారపు కుప్పలమీదనించే నడిచిపోవాలి. చిట్ట చివరకు ఒక గదికి తీసుకు



వచ్చి, భటుడు "అయ్యా! దివ్యపేటిక ఉండేగది యిదేను," అని చెప్పాడు. ఈ మాట వినగానే భట్టు పరవశుడైపోయాడు.

దివ్యపేటిక అనగా బ్రహ్మాండమైన ఒక భోషాణమంత పెట్టె. దానిని పాతిక మంది బలాఢ్యులుకూడా ఎత్తలేరు. అప్పుడు దేవదూత అగదిలో ప్రత్యక్షమై, "భట్టూ! ఇదే నీవు కోరిన దివ్యపేటిక. ఇది ఎక్కడ ఉంటే అక్కడ సంతృప్తి, మనశ్శాంతి ఉంటాయి. దీనిని నీవు ఇంటికి తీసుకు వెళ్ళి జాగర్త పెట్టుకొని హాయిగా ఉండు. కాని, ఒక్కమాటమాత్రం మరువకు: దీనిని నీవు యింటికి తీసుకువెళ్ళి, తలుపులూ, కిటికీలూ మూసివేసి అప్పుడు మూత తెరవాలి. ఈసంగతి గుర్తుంచుకో" అనిచెప్పి అదృశ్యమయ్యాడు.

భట్టు, తను తెచ్చిన కానుకలన్నీ దేవదూతకు సమర్పించి, సెలవుతీసుకున్నాడు. అక్కడనే తనకు దారిచూపిన బిచ్చగాడు కనిపించి, "ఏమయ్యా భట్టూ! ఎందు కింత తొందరపాటు? నేను వచ్చేవరకు ఉండలేక పోయావే! మనిషికి ఆత్రం ఎప్పటికైనా హాని తెస్తుంది సుమా!' అని హెచ్చరిస్తూనే మాయమయ్యాడు.

శాంతినీ సంతృప్తినీ ఇచ్చే దివ్యపేటిక ఇంత సులువుగా లభించినందుకు భట్టు అపరిమితంగా సంతోషించాడు. ఆ పేటికను అతను క్షణమైనా వదిలిపెట్టేవాడు కాదు. రాత్రిపూట తనే స్వయంగా ఆ పేటికమీద పక్కవేసుకొని పడుకొనేవాడు. ఇక ఇంటికి వెళ్ళగానే మనశ్శాంతి కుదురుతుందికదా అని అతను ఉవ్విళ్లూరజొచ్చాడు. కానైతే, రాత్రి దానిమీద పడుకున్నప్పుడు నిద్రపట్టక, ఈ పేటికలోపల ఏమిటి వున్నదో! ఇంకా ఎప్పుడు తీసి చూడటం?' అనే ఆత్రం బాధిస్తూ వుండేది.

భట్టు పరివారంతోసహా ఇంటి ముఖంపట్టి రెండు నెలల యిరవైరోజులైంది. అనగా, ఇంక సరిగ్గా పదిరోజులలో ఇల్లు చేరుకో గలరన్న మాట. ఇంతవరకు ఎలానో ఓగ్గబట్టుకున్నాడు గాని, ఇక ఆగలేక పోయాడు. ఒకరోజున పరివారమంతా మంచి నిద్రలో ఉండటంచూసి, కాంచన భట్టు ఎవ్వరికీ తెలియకుండా పేటికకు వేసివున్న యాభైతాళాలు గబగబ తీసాడు. ఆ భోషాణం తెరవగా ఒక పెట్టె కన పడింది. దానిమూత తెరవగా మరిఒక పెట్టె కనపడింది. ఇలాగ ఒకదానిలో ఒకటి వరసన నూటపదహారు పెట్టెలు కనపడినై. చిట్టచివరిపెట్టెలో ఒక చిన్న పంజరం కనపడింది. దానిలో రెండు పక్షులు కలకల్లాడుతూ ఉన్నాయి. ఒక్కొక్క పక్షి కాళ్ళవగ్గర ఒక్కొక్క బంగారు బరిణె మెరుస్తూ కనపడినై. ఆ బరిణెల మూతలు రెండూ తీసేసరికి ఒక్కొక్కదానిలోనుండి ఒక్కొక్క చిత్రమైన వెలుగు ఇవతలకి వచ్చి, వెంటనే ఆకాశంలో మాయమైనాయి. ఆ వెలుగులు మాయంకావటంతోనే పంజరంలోని పిట్టలు రెండూ నేలకు ఒరిగిపొయినై.

ఇవే శాంతి, తృప్తి అనేటటువంటి పక్షులు. బిచ్చగానిమాట వినక, ఆత్రపడి భట్టుచేసిన తప్పిదంవల్ల ఈనాడు ప్రపంచానికే ముప్పువచ్చింది. దేవదూత చెప్పినట్టు విని, ఇంకొక్క పదిరోజులు ఆగిన ట్టయితే, భట్టుకీ, మనకూకూడా క్షేమం కలిగేది. కాని, ఇప్పుడు ఆ పక్షుల జీవాలు ఎగిరిపోవటంవల్ల లోకంలో ఎక్కడా శాంతీ, తృప్తీ లేకుండాపోయినై.

ఎగిరిపోయిన ఈ శాంతి పక్షుల జీవాలు ఎలాఅయినా మళ్లీ భూలోకానికి తెచ్చి, లోకోపకారం చేయటానికే హిమాలయ పర్వతాల్లో మహర్షులు ఇప్పటికీ తపస్సు చేస్తూవుంటారు.






అనగనగా ఒక వూరిలో ఒక సాహుకారు. ఆ సాహుకారికి నలుగురు కొడుకులు. ఒకరోజున నలుగురు కొడుకులనూ పిలిచి "అబ్బాయిలూ!—ధనం సంపాదించటానికి మంచిమార్గం ఏది"? అని అడిగాడు. మొదటి ముగ్గురూ వాళ్ళ వాళ్ళకు తోచిన ఆలోచనలు చెప్పారు. నాలుగోవాడు మాత్రం అనాలోచితంగా "నాకేం, నేను మహారాజు నవుతాను, రాజ్యంఏలుతాను" అన్నాడు. కడసారివాడైన సిరిపాలుడి ఈ డాబుకబుర్లు విని తండ్రికి కోపంవచ్చి, అతనిని ఇంటినుంచి వెళ్ళగొట్టాడు.

సిరిపాలుడు సరాసరి పోయి నవద్వీపం చేరుకుని అక్కడ ఒక గురువుని ఆశ్రయించి, విద్యలు నేర్చుకొంటూ వున్నాడు. ఆ గురువువద్దనే రత్నమంజరి అనే రాజకుమారీ, ఒక మంత్రికుమారుడూ కూడా విద్యలు అభ్యసించుతూ వున్నారు.

ఇలా వుండగా, రత్నమంజరికి మంత్రి కుమారుణ్ణి పెళ్ళాడుదామని మక్కువ కలిగింది. కానైతే ఈసంబంధం మంత్రి కుమారుడికి ఎంతమాత్రమూ ఇష్టంలేదు. అందుచేత, ఏదో సాకుచెప్పి జరుపులు పెడుతూ వచ్చాడు. ఒకనాడు రత్నమంజరి అతన్ని నిర్బంధించేసరికి ఆమెను సమాధానపరచటం తప్పనిసరి అయింది. అందుకని, ఎలాఐనా ఈగొడవ వదిలించుకోవాలని నిశ్చయించుకుని మంత్రికుమారుడు సిరిపాలుణ్ణి పురికొల్పాడు. "వోయినేస్తం!- నా దుస్తులు ముస్తాబు చేసుకుని, అచ్చ నాలాగానే తయారయి ఒంటెమీద రాజకుమారిని ఎక్కించుకుని తీసుకపో!" అనేవరకు, సిరిపాలుడు రెండో ఆలోచన లేకుండా 'అలాగే' అనేశాడు. ఆ సాయంత్రమే సిరిపాలుడు గురువు వద్దకు పోయి, 'నేను రాజకుమారిని పెళ్ళాడ

ఆర్. స్నేహలత, బొంబాయి




దలిచాను. ఈరాత్రే వెళ్ళిపోతాము, సెల వియ్యండి" అని అనుజ్ఞ కోరేసరికి వాని అమాయకత్వంచూచి గురువుకి జాలి కలిగింది. వెంటనే ఆయన సరస్వతీదేవిని ప్రార్థించగా ఆమె ప్రత్యక్షమై సిరిపాలుని నోటిలో మంత్రజలం పోసింది. ఆ క్షణం నించీ అతనికి అపారమైన తెలివితేటలు పుట్టుకువచ్చినై.

రాత్రి చీకటిలో సిరిపాలుడే మంత్రి కొడుకని అనుకొని, రత్నమంజరి ఒంటె నెక్కింది. వారు ఒక అడవిమార్గం పట్టి పోయారు. తెల్లవారగానే ఆమె వానిని చూచి 'అయ్యో, ఎంత ప్రమాదమైంది! ఈ తెలివితక్కువవానితోనా నేను కాపరం చేయవలిసింది!!' అనుకొని విచారించి, అతనితో మాటాడటమే మానివేసింది. వారు పోయి పోయి అమరావతీ నగరం చేరుకొన్నారు. ఆ దేశపురాజు సిరిపాలుని తెలివితేటలను గురించి విని, తనమంత్రిగా చేసికొన్నాడు. సిరిపాలుడు రాజుకి గొప్ప గొప్ప సలహాలిస్తూ ఉండేవాడు. రాజ్యంలోని ప్రజలందరూ సిరిపాలుని ఎంతగానో మెచ్చుకొంటున్నారు. అతని బుద్ధి విశేషాన్నిగురించి అమ్మలక్కలందరూ రత్నమంజరితో చెబుతూ ఉండేవారు కాని, ఆమెకుమాత్రం నమ్మకం కలగలెదు. ఆమె మేడమీదనే ఉంటూ మగనితో మాటాడేది కాదు.

ఈ విడ్డూరం రాజు చెవులబడింది. 'రాజ్యంలో ప్రజలనందరినీ మెప్పించిన ఈ సిరిపాలుడు భార్యను మెప్పించలేకపోవడమేమిటి! ఆమె ఎటువంటిదో!!' అని తలచి, సిరిపాలునితో "మంత్రీ! నే నీ రాత్రి మీ యింటికి భోజనానికి వస్తాను. నీ భార్యచేత స్వయంగా వంట చేయించి వడ్డింపించాలి" అనేసరికి, అతను వప్పుకొని, భార్యకు కబురుచేశాడు.



రాజు భోజనానికి వచ్చాడు. రాజకుమార్తె వడ్డిస్తూ వడ్డిస్తూ మూడుసార్లు వేరు వేరు రంగుల చీరలు మార్చి కట్టుకుంది. మూడుసార్లూ ముగ్గురు స్త్రీలువచ్చి వడ్డించారని అనుకున్నాడు రాజు. కాని, మంత్రిభార్య చేసిన యుక్తి కనిపెట్టలేకనే పోయాడు.

చేసేదేముంది? రాజు ఇంటికి వెళ్లాడు. ఐనా ఆమె తెలివితేటలనుగురించి తెలుసుకోవాలెననే పట్టుదలతో మంత్రిని మళ్లీ పిలిచి "నీ భార్య బాగా పాడగలదట. ఈ సాయంత్రం నేనూ దేవేరిన్నీ దేవాలయానికి వస్తున్నాము. అక్కడ నీ భార్య పాట ఏర్పాటు చేయవలిసింది" అని చెప్పాడు.

ఈ మాట సిరిపాలుడు తన భార్యకు చెప్పి పంపగా, ఆమె "నా భర్త మద్దెల వాయించినట్టయితే, నేను పాడటానికి అభ్యంతరం లేదు" అంటూ జదులు పంపింది. సిరిపాలుడు వప్పుకొన్నాడు. ఆ సాయంత్రం దేవాలయంలో రత్నమంజరి అద్భుతంగా పాడింది. అంతకు మించి అద్భుతంగా సిరిపాలుడు మద్దెల వాయించాడు. అప్పుడు రాజకుమారికి తన భర్త మీద నమ్మకం ఏర్పడి, మాటాడటం ప్రారంభించింది.

తెలివితేటలలో అతీతమైన ఈ అపూర్వ దంపతులను ముత్యాల పల్లకిలో కూర్చోబెట్టి అమరావతీపట్టణ రాజు అతి వైభవంగా ఊరేగింపించాడు. రాజ్యంలో ప్రజల ఆనందానికి అంతు లేకపోయింది. రత్నమంజరీ, సిరిపాలురపైన దేవతలు పూల వర్షం కురిపించారు. ఊరేగింపులో—ఈ దంపతులకు విద్య ప్రసాదించిన సద్గురువున్ను, గురు కటాక్షంవల్ల సిరిపాలునికి ప్రసన్నమైన సరస్వతీదేవికూడా ప్రత్యక్షమై వారిని అనేకవిధాల ఆశీర్వదించారు.




పూర్వం ఒకరాజు ఉండేవాడు. ఆయన ముసిలివాడైనాకూడా చిన్నపిల్లలకుమల్లే యేటా పుట్టినరోజు పండగ చేసుకోటానికి సరదా పడేవాడు. ఆరాజు తన డెబ్భయ్యో పుట్టిన రోజునాడు పట్టణమంతా అతి అద్భుతంగా, అపురూపంగా అలంకరించవలసిందని ఆజ్ఞాపించాడు. ఆవేళ రోజూ మల్లే యెవ్వరూ శ్రమపడకూడదనీ, అన్ని పనులూ కట్టిపెట్టేసి పండుగరోజుకు మల్లే హాయిగా, నిశ్చింతగా గడపవలసిందనీ పట్టణంలో చాటింపు వేయించాడు.

రాజు అజ్ఞప్రకారం ప్రజలంతా తమ తమ పనులన్నీ మానేసి, ఆరోజంతా వినోదంగానే గడిపారుగాని వెంకన్న అనే ఒక గొడారివాడుమాత్రం తనపని మానలేదు. వాడు యథాప్రకారం చెప్పలు కుట్టుకుంటూ కనపడేటప్పటికి రాజభటులు వాణ్ణి లాక్కుపోయి రాజు ముందు పెట్టేరు.

'ఎవరు వీడు? ఎందుకిలాగ తీసుకొచ్చారు?' అని అడిగాడు రాజు.

అందుకు భటులు 'మహాప్రభూ! వీడు తమ ఆజ్ఞప్రకారం యీ రోజున సెలవు తీసుకొని ఆనందించటానికి బదులు రోజూకిమల్లేనే చెప్పలు కుట్టుకుంటూ కూచుకున్నాడు. ఏలినవారి ఆజ్ఞ ధిక్కరించి నేరంచేశాడు గనక పట్టుకు తీసుకు వచ్చాం' అన్నారు.

అప్పుడు రాజు ఆ గొడారివాణ్ణి పిలిచి, 'ఏమిరా అబ్బీ, తక్కినవాళ్ళకి మల్లే నువ్వుకూడా సెలవుతీసుకుని ఆనందించక పనిపెట్టుకుని కూచున్నా వెందుచేత?' అని అడిగాడు.

'మహాప్రభూ! పని మానేస్తే ఈరోజు బువ్వ యెలాగ వస్తుంది? రెక్కాడితే కాని డొక్కాడని స్థితి కదా బాబూ, మాది!' అన్నాడు గొడారి వెంకన్న.

పాలంకి వెంకటరామచంద్రమూర్తి, మదరాసు



'ఇదివరకు సంపాదించుకున్నది యేమీ నిలవ వేసుకోలేదా మరి? ఎప్పటి దప్పుడే ఖర్చుపెట్టేశావా? ఇంతకూ నువ్వు రోజూ నీవృత్తివల్ల యెంత సంపాదిస్తావు?' అని ప్రశ్నించాడు రాజు.

'ఆరణాలు సంపాదిస్తాను ప్రభూ' అన్నాడు గొడారివాడు.

'ఆరణాలే! ఇంకనేం? డబ్బిస్తే తవ్వెడు కందులు వచ్చే ఈ చవకరోజులలో నీలాంటివాడికి రోజుకు రెండణాల కన్న ఎక్కువ అక్కర్లేదు. మిగత నాలుగణాలూ నిలవచేసుకోక యేంచేస్తున్నట్టు?' అన్నాడు రాజు.

ఇలాగ తనను రాజుగారు నిలదీసి అడిగేటప్పటికి వెంకన్న—

"సగముతో ఋణము తీర్చెదను!
సగముతొ ఋణము నిచ్చెదను!!"

అనిచెప్పి ఊరుకున్నాడు.

రాజుగారికి వాడి మాటలలోని అర్థం తెలిసింది కాదు. 'ఏమిటీ, రెండణాలతో ఋణం తీరుస్తావా? ఆలాగైతే నీకుఅప్పులు కూడా ఉన్నాయన్నమాట. ఋణాలున్నవాడివైతే రోజూ నాలుగణాల చొప్పున ఆ ఋణాలు తీర్చేసుకోక అందులో మళ్లీ



రెండణాలు కేటాయించి మరెవడికో అప్పు ఇవ్వడమేమిటి చిత్రం?' అని అడిగేడు.

అందుకు బదులుగా గొడారి వెంకన్న చేతులు జోడించి ఇలాగచెప్పేడు: "మహా ప్రభూ! నాతండ్రి యింకా జీవించిఉన్నా, అతడు ఇప్పుడు సత్తువ ఉడిగిపోయి ముసిలివాడై ఉన్నాడు; పనిచేసి డబ్బు సంపాదించుకురాగల కాలం వెళ్ళిపోయిందతనికి. నా చిన్నతనంలో అతడు వ్యయప్రయాసలకు లక్ష్యపెట్టక నన్ను పెంచి పెద్దవాణ్ణి చేశాడు. అతనివల్ల ప్రయోజకుణ్ణి ఐ, ఇప్పుడు సంపాదించుకుంటూన్న నేను నా సంపాదనలోంచి రోజూ రెండు



గనా. ఆ దారుఢ్యం లేనికాలంలో నాకు, నా కుమారుడు సంపాదించి పెట్టాలి. అందుకోసం ఇప్పుడు వాడికి ధనం ఇచ్చి పెద్దవాణ్ణి చేసినట్టయితే, తర్వాత నా ముసిలికాలంలో వాడు నాఋణం తీర్చుకుంటాడు' అని చెప్పాడు.

రాజు 'సెబాష్' అని గొడారివాని తెలివికి మెచ్చుకుని,

"సగముతో ఋణము తీర్చెదను !
సగముతో ఋణము నిచ్చెదను !"

అంటూ అదేపనిగా పాడటం ప్రారంభించాడు. అప్పుడాయనకు ఒక గమ్మత్తు చేద్దామనిపించింది. 'అబ్బాయీ, వెంకన్నా !—ఈ మాటల అర్థం ఎవరికీ నువ్వు చెప్పకు. మా కొలువులో ఉండే ఉద్యోగస్తుల్ని అందర్నీ పిలిచి, ఈమాటల్ని ఒక పొడుపు కథలాగ ఇచ్చి, వీటి అర్థమేమిటో చెప్పకోమంటాను. చూదాం, ఏం జరుగుతుందో !' అన్నాడాయన. అందుకు వాడు 'స్వామీ, ఈ రహస్యాన్ని చాలాకాలం దాచమంటే నావల్ల కాదు. తమరు ఏదైనా ఒక గడువు పెట్టినట్టయితే అంతవరకూ ఎలాగనో ఉగ్గబట్టుకుని ఉంటాను' అన్నాడు.

అణాలు అతనికి ఖర్చుకోసమని యిచ్చి, అతని ఋణాన్ని తీర్చుకుంటున్నాను. 'సగముతో ఋణము తీర్చెదను' అనటంలో ఉద్దేశమిది." అని ఆగాడు.

రాజు గొడారివాని పితృభక్తికి మెచ్చుకున్నాడు. "ఐతే, 'సగముతో ఋణము నిచ్చెదను' అంటివే. ఋణం ఎవరికిస్తావు ?" అని మళ్లీఅడిగేడు.

అందుకు వెంకన్న 'ప్రభూ, ఎవరికో గాదు; ఆ రెండణాలూ నా కొడుకునకే ఇస్తాను. నా తండ్రికిమల్లే నేను కూడా కొన్ని సంవత్సరాలు గడిచేటప్పటికి ముసిలివాణ్ణి ఐపోయి జవసత్వాలు ఉడిగిపోతాయి



'అలాగైతే నువ్వు నూరుమార్లు నా దర్శనం చేసేవరకూ ఈ రహస్యాన్ని బయట పెట్టకు' అని ఆజ్ఞాపించాడు రాజు.

గొడారివాడు 'సరే' నని ఒప్పుకొని వెళ్లిపోయాడు. రాజుగారు వెంటనే సభ చేసి, మంత్రీ, సేనాధిపతీ, కొత్వాలూ మొదలైన ఉద్యోగులు రావటంతోనే —

"సగముతో ఋణము తీర్చెదను !
సగముతో ఋణము నిచ్చెదను !"

అని చదివి, 'ఈ పొడుపు కథకు అర్థం ఏమిటో చెప్పుకోండి చూదాం' అన్నాడు.

వాళ్లలో ఒక్కరు కూడా చెప్పుకోలేక, ఒకళ్ల మొహా లొకళ్లు చూడటం మొదలెట్టేరు. 'ఓశ్, ఇంతేనా మీ తెలివి ?' అని రాజుగారు వేళాకోళం చేసేటప్పటికి మంత్రి లేచి, 'ప్రభూ, ఈ రాత్రి గడువివ్వించండి. రేపు చెపుతాను' అన్నాడు. 'సరే' అని ఒప్పుకుని రాజుగారు ఆ రోజుకి సభ చాలించారు.

'రాజుగారికి ఈ రోజున యీ పొడుపు కథను ఎవడో వచ్చి చెప్పి ఉండాలి. రాజువద్దకు ఎవరెవరు వచ్చారీవేళ ?' అని ఆలోచించాడు మంత్రి. వాకబు చెయ్యగా గొడారివాడు వచ్చి వెళ్లినట్లూ, వాణ్ణి రాజుగారు శిక్షిస్తారనుకుంటే అలా శిక్షించటానికి బదులు వాడితో ఆయన యేవేవో చాలాసేపు మాట్లాడి పంపేసినట్లూ తెలిసింది. మంత్రి తక్షణమే గొడారి వెంకన్నవద్దకు వెళ్లి, 'ఏం, వెంకన్నా !— ఈ పొడుపు కథను యీ రోజున రాజుగారికి ఎవరు నేర్పారో నిజం చెప్పు, దాచక' అని దబాయించాడు.

'నేనే బాబూ' అన్నాడు వెంకన్న.

'దీని అర్థమేమిటో చెప్పు. నీవు యేమి కోరుకుంటే అది యిస్తాను,' అని వాగ్దానం చేశాడు మంత్రి.

'అలాగైతే నూరు వరహాలు ఇప్పించండి, ఏదో మీ పేరు చెప్పుకొని నేనూ నా బిడ్డలూ, కాసిన్ని గంజినీళ్లు తాగుతాం" అన్నాడు వెంకన్న.

వెంకన్న కోరినప్రకారం మంత్రి నూరు వరహాలు ఇచ్చి, వేగిరపెట్టేసరికి, వాడు ఒక్కొక్క నాణెమే పరిశీలిస్తూ లెక్కపెట్టుకుని, నూరూ ఉన్నాయని లెక్క తేలిన తరవాత ఆ మాటల అర్థం కాస్తా మంత్రికి చెప్పి పంపేశాడు.

మర్నాడు రాజసభలో మంత్రి బడాయిగా లేచి పొడుపుకథ అర్థం చెప్పేశాడు. మంత్రి తెలివికి అందరూ మెచ్చుకున్నారు గాని రాజుగారికి మాత్రం చాలా కోపం వచ్చింది. తక్షణమే గొడారివాణ్ణి లాక్కురమ్మని భటులకు ఆజ్ఞాపించాడు. వాడు రావటంతోనే 'ఏమిరా, వెంకన్నా! నువ్వేనా ఈ రహస్యం మంత్రికి వెల్లడి చేసింది?' అని గద్దించి అడిగేడు.

'చిత్తం మహాప్రభూ.' అన్నాడు వినయంగా, వెంకన్న.

'నా దర్శనం నూరుమార్లు చేసిగాని రహస్యం వెల్లడివెయ్యనని వప్పుకుని ఇలా చేశావేం?' అని గర్జించారు రాజావారు.

'మహాప్రభూ, నూరుమార్లూ 'మీ దర్శనం చేసినతరువాతనే మంత్రిగారికి యీ రహస్యం చెప్పాను, అందుకు మంత్రిగారే సాక్ష్యం. వారి యెదటనే నేను, నూరు వరహాలమీదనూ వున్న తమ బొమ్మలను దర్శనం చేసుకుని, ఆతర్వాతనే వారికి రహస్యం చెప్పేను.' అని బదులుచెప్పాడు.

ఈమాటలు వినేటప్పటికి రాజుగారి కోపంఅంతా మాయమై పోయింది. 'బలే వాడివిరా వెంకన్నా!—నీ తెలివికి మంత్రి యిచ్చిన నూరు వరహాలూ చాలవు. ఇంకో నూరు వరహాలు నేను ఇస్తున్నాను పట్టుకెళ్ళు' అంటూ రాజుగారు స్వయంగా బహుమానం యిచ్చి వాణ్ణి పంపేశారు.



## వడ్రంగిపిట్ట ముక్కు పొడవుగా వుంటుంది

# ఎందుకో తెలుసా?

CHITRA

పూర్వకాలమందు దుష్టురాలైన ఒక ముసలిది ఉంటూ వుండేది. ఆమె చేసేవన్నీ దుర్మార్గపు పనులే. ఎవళ్ళు ఏంచెప్పకొంటున్నారో అని గోడలచాటున పొంచివుండి వినటం, ఇక్కడి మాటలు అక్కడా—అక్కడి మాటలు ఇక్కడా చెప్పి కలహాలు రేపెట్టడం, లేనిపోని కథలు అల్లి అనుకూలంగా వుండే ఆలుమగల్ని విడదీయటం, ఇలా చేసేది. పైగా— తన దిష్టికళ్ళు పెట్టుకుని అందరి యిళ్ళల్లోనూ ప్రతిదాంటో తొంగిచూస్తూ వుండటం, తన జానెడుబెత్తెడు ముక్కుతో ప్రతివస్తువా వాసన చూడటం—ఇటువంటి చిలిపి చేష్టలు ఎన్నో చేస్తూవుండేది. అందుచేత ఈ ముసలిదాని మూలాన లోకానికి చాలా బాధగా వుండేది.

ఆదిశక్తి అయినటువంటి దుర్గాదేవి ఇదంతా కనిపెట్టి, "ఈ దుష్టురాలిని ఇక శిక్షించక ఒక్క క్షణమైనా ఊరుకుంటే లాభంలేదు. గట్టిగా బుద్ధిచెప్పాలి" అని నిశ్చయించుకుంది.

ఈ నిశ్చయంతో దుర్గాదేవి మానవ రూపంతో భూలోకానికి దిగివచ్చి, తనతో కూడా ఒక సంచీ పట్టుకవచ్చింది. ఆ సంచీ ముసలిదానికిచ్చి, "అవ్వా, అవ్వా! నీకు గొప్ప బహుమతి ఇస్తున్నాను. ఐతే ఇంటికి వెళ్ళేవరకూ దీన్ని విప్పకూడదు సుమా!" అని హెచ్చరించింది. "అయ్యో నా తల్లీ! నీవు వద్దని చెప్పినప్పుడు నేను విప్పిచూస్తానా? తిన్నగా ఇంటికిపోయి, అక్కడే జాగర్తగా తెరుస్తాను" అని ముసలిది నమ్మబలికి, సంచీ పట్టుకు బయలుదేరింది. దేవి అదృశ్యమైపోయింది.

నాలుగడుగులు వేసిందో లేదో, ముసలిదానికి చేతులు గురగురమన్నాయి. దిష్టికళ్ళు మూతపడకుండా అలానే తెరుచుకు

ఈ నెల బహుమతి పొందిన కథ — బి. చిన్నాజీరావు, విజయనగరం

* బహుమతిగా అక్టోబరు '50 నుంచి మార్చి '51 వరకు 'చందమామ' పంపబడుతుంది.

చూస్తున్నై. ఆమె జానెడుబెత్తెడు ముక్కు 'ఆ సంచీలో ఏమిటున్నాయి? ఏమిటున్నాయి?' అంటున్నది. ముసిలికి కడు పుబ్బరం ఎక్కువయి, ఇంక ఉండబట్ట లేక పోయింది. ఒక మూలని కుప్పలాగా కూలబడి ఎవళ్లూ చూడకుండా మెల్లిగా సంచీ మూతివిప్పింది.

విప్పేసరికల్లా — ఎప్పుడు బయటపడదామా అని ఎదురుచూస్తూవున్న రకరకాల చీమలు, దోమలు, తేళ్ళు; పాములు, పురుగులు, ఈగలు, మిడతలు, పీతలు, జలగలు, మొదలైన విషకీటకాలు వందలూ వేలూ బిలబిలమంటూ ఇవతలకి వచ్చేసి గట్టుల్లోకి, పుట్లల్లోకి, కన్నాల్లోకి, బొరియల్లోకి దూరిపోయినై, పారిపోయినై, చెట్లపైకి ఎగిరిపోయినై.

ఇదంతా చూచి ముసిలిదానికి హడలుచ్చుకుంది. 'అయ్యో బాబో, ఎంతపని జరిగిందీ!' అనుకొంటూ, చేతికి అందిన విషకీటకాల నన్నింటినీ అదిమిపట్టి మళ్లా సంచీలోవేసి కట్టింది. ఇంతాచేసి పటుమని పదైనా ఆమె చేతికి దొరకనేలేదు. చిక్కినవి కాసినీ సంచిలో ఒకమూల నక్కినై.

అప్పుడు దుర్గాదేవి దిగివచ్చి, "ఓసి ముసిలీ! నువ్వు దుష్టపీనుగవు. ఈ భూలోకంలో మానవరూపంతో ఉండతగవు. నేను నీచేతికిచ్చిన సంచులు ఎందుకు తెరిచావ్? క్రిమికీటకాదులన్నీ ఏవి? నీమూలాన ప్రపంచానికి ఎంతో హాని జరిగింది. కనుక, ఒక్కటీ మిగలకుండా వాటన్నిటినీ పట్టి తెచ్చి ఈ సంచీ నింపేవరకూ, నువు వడ్రంగిపిట్టవై ఉండు,' అని శపించింది.

ఆనాడే దుర్మార్గురాలైన ఆ ముసిలిది వడ్రంగిపిట్ట అయి పుట్టింది. దాని జానెడు బెత్తెడు ముక్కుతో టక్కు టక్కుమని పొడిచి చెట్లు తొర్రలుచేసి, పారిపోయిన కీటకాలకోసం ఇప్పటికీ దేవుడా అంటూ అలా వెతుకుతూనేవుంది.



# చందమామ బొమ్మల పజిలు





# పిల్లల పెంపకం

తల్లులకు మాత్రము

## మాతృపూజ

పెద్దలకున్నట్టే పిన్నలకుకూడా జీవితంలో నెరవేర్చవలసిన విధులు ఎన్నో వున్నయి. అందులో బిడ్డలకు ముఖ్యమైంది తల్లిని పూజించటం. బిడ్డను పెంచటానికి కన్నతల్లి ఎన్ని శ్రమలు పడుతుంది! ఆమెకుండే అనురాగం ఎటువంటిది!!—ఈ సంగతులు అందరకూ తెలిసినవే.

ప్రపంచంలో మాతృస్థానం మహా గౌరవమైన స్థానం. ఏమీ అంటే—తల్లి తన బిడ్డ కోసం సమస్తమైన సుఖాలనూ త్యాగం చేస్తుంది. బిడ్డల క్షేమంకంటె ఆమెకు ఎక్కువ ఆనంద మిచ్చేది మరేదీ లేనేలేదు. బిడ్డల సుఖమే ఆమె సుఖము. వాళ్ళ విచారమే ఆమె విచారము. ఈవిధంగా తల్లి అహర్నిశలూ తన మనసునంతా బిడ్డలమీదనే పెట్టుకొని వుంటుంది. ఆమె ప్రేమ మహత్తరమైనది. కనుకనే, తల్లిరుణం మనమెన్నటికీ తీర్చుకొనలేమంటారు పెద్దలు.

ఈ కారణంచేతనే, బిడ్డలు పెరిగి పెద్దవాళ్ళవుతున్నకొద్దీ తల్లిని అన్నివిధాలా సంతోషపెట్టటానికే ప్రయత్నించాలి. ఇందుకోసమే శక్తినంతటినీ వినియోగించాలి. తల్లి ఆజ్ఞలన్నిటినీ శిరసావహించాలి. సంతోషంతో వాటిని వెంటనే నెరవేర్చాలి. మంచితల్లి ఎల్లప్పుడూ బిడ్డలక్షేమం కోరి, మంచిసలహాలనే యిస్తుంది. కనుక, తల్లిమీద బిడ్డలున్న పూర్ణమైన భక్తీ విశ్వాసమూ ఉంచి, ఆమెకు సమస్త ఉపచారములూ చేయటం వాళ్ళ విధి. ఈ ప్రపంచంలో తల్లిప్రేమను మించినది లేదు. కాబట్టి,—

'నవమాసములు మోసి నన్ను గన్నట్టి
తల్లికంటెను వేరు దైవంబు కలదె?'

అని నమ్మి, మాతృదేవిని పూజించేటందుకే ఎల్లప్పుడూ బిడ్డలు ప్రయత్నించాలి. బిడ్డల విధులు ఇంతటితో తీరలేవు. ఇంకా ఎన్నో ఉన్నయి. ఈసారి మరికొన్ని.

'మీ పెద్దమ్మ'

# మాటల చదరం




ప్రక్కనున్న చదరములో మూడేసి అక్షరాల మాటలు ఏడు నింపాలి. ఒక్కొక్కదానికి ఆధారాలు యివ్వబడినై. ఇందులో వుండే కీలకాలు రెండే రెండు. ప్రతి మాటకు చివరి అక్షరం ఒకేమాదిరిదై వుంటుంది. అంతే కాదు. ప్రతిమాటలోని మొదటి అక్షరమూ చేర్చి, పైనించి కిందికి చదివితే ఒక పట్టణం పేరు వస్తుంది. తెలియకపోతే జవాబుకి 55-వ పేజి చూడండి.

ఆధారములు

1. ధనము
2. ప్రపంచము
3. కీర్తి
4. పర్వతము
5. ఏనుగు
6. ధ్వని
7. సంతోషము

---





హెచ్. శాంత, మంగళూరు.




## తాళం వేసిన ట్రంకులోనించి బయటకు రావటం

నిన్ను ఒక పెద్ద ట్రంకు పెట్టెలో పెట్టి మూసి బైట గట్టితాళం వేసేస్తారు. వేసిన తాళం వేసినట్టుండి, ఒక్క అరగంటలో నువ్వు బైటికి వచ్చేస్తావు. ఎలాగ?

ప్రదర్శనానికి వచ్చేముందుగా నీతో పాటు నీవు పట్టేపాటి ట్రంకు పెట్టె ఒకటి తెచ్చుకోవాలి. నీవు తెచ్చుకొనే ఈ ట్రంకు పెట్టెనుగురించి ముఖ్యంగా గమనించవలసిన విషయం ఒక్కటి వున్నది. అదిఏమిటీ అంటే—ట్రంకు పెట్టె పైమూతకు వుండే తాళంబిళ్ళకు రెండు మర మేకులు దూర్చబడి, మూత లోపలివైపున రెండు చీలలతో బిగించబడి వుండాలి. ఈ ఒక్క విషయమూ సరిగా వున్నట్టయితే ప్రేక్షకులలో ఎవరు ఎలాటి గట్టి ట్రంకుపెట్టె తెచ్చియిచ్చినా, దానితోనైనా ఈ ట్రిక్కు చెయ్యవచ్చు. ప్రక్క పేజీలోవున్న బొమ్మ చూడు. 1 సంఖ్య చూపబడిన గాడీలలో 2 వ నెంబరులో చూపినమోస్తరు మర మేకులు బిగించబడి వుండాలన్నమాట.

మరొక విషయం: ప్రదర్శనానికి వచ్చేటప్పుడు నీవు బూట్లు తొడుక్కొని రావాలి. ఒక బూటు అడుగుభాగంలో మడిమ బిళ్ల మామూలుగావుండి ఒకప్రక్కకు తొలిగించటానికి వీలుగా వుండాలి. తొలిగించబడిన బిళ్ళకీ బూటుకీ మధ్య ఖాళీగా వుండి, ఆ ఖాళీలో ఒక చిన్న పటకారూ, ఒక చిన్న రెంచీ దాచివుంచాలి. మడిమ బిళ్ళ ఒక్కచోటమాత్రం మరమేకుతో బిగించబడి వుంటుంది. బొమ్మలో చూడు.

మరమేకులతో బిగించబడిన ట్రంకు పెట్టె, పనిముట్లు దాచివుంచబడిన బూటూ—ఈ రెంటితో ప్రదర్శనానికి వస్తావన్నమాట. ఇక ట్రిక్కు చేసే విధానం—

మొట్టమొదట ట్రంకుపెట్టె ప్రేక్షకులకిచ్చి బాగా పరీక్ష చేసుకోమను. తర్వాత, నిన్నుకూడా పరీక్ష చేసుకోమను. ఇలా పరీక్ష చేసుకున్న తర్వాత—"చూడండీ! నన్ను ఈ పెట్టెలో పెట్టి మూసి, మీ యిష్టంవచ్చినంత గట్టితాళం వేసెయ్యండి.

తర్వాత మీరే ఈ పెట్టెని తెర వెనక వుంచి చూడండి. కాస్సేపటికల్లా నేను మీ ఎదటికి పెట్టెతోసహా వచ్చేస్తాను" అనాలి. ఆ ప్రకారం వాళ్లు నిన్ను పెట్టెలోపెట్టి తాళంవేసి తెరవెనక చేరుస్తారు.

అప్పుడు నువ్వు నెమ్మదిగా నీ బూటులో దాచుకున్న పటకారు సహాయంతో తాళం బిళ్ళకి లోపల బిగించిన మర తీసివేసి ఆ రెండు మేకులనీ నీ కోటు జేబులో వేసుకో. ఇప్పుడు మూతకి ఏ ఆధారం లేదు కనుక తేలికగా పైకి వచ్చేస్తుంది. నువ్వు పెట్టెలోంచి యిలా బయటికి వచ్చినతర్వాత చాల ముఖ్యంగా గుర్తుంచుకోవలసిన విషయం ఒకటి వున్నది. మూత తిరిగి వేసెయ్యి. మర మేకులు తీసివేసినచోటకనిపించే రెండు బెజ్జాలలో నీ కోటు జేబులో వుంచుకున్న మర మేకులు. రెండూ పెట్టెయ్యి. తాళం వున్నవైపు పైకి వుండేట్టుగా ట్రంకు పట్టుకుని తెర వెనకనించి బయటికిరావాలి. ట్రంకుని తలక్రిందులు చెయ్యకుండా అలాగే పట్టుకుని మళ్లీ ప్రేక్షకులను ట్రంకు నాలుగువైపులా పరీక్ష చెసుకోమను. వేసిన తాళం వేసినట్టేవుండి, ట్రంకు ఎక్కడా చెక్కు చెదరకుండా వుండటం చూచి ప్రేక్షకులు అమిత ఆశ్చర్యపోతారు.




ఈ ట్రిక్కు చెయ్యటంలో ముఖ్యంగా జాగ్రత్తపడవలసిన ఘట్టాలు తిరిగి చెబుతున్నాను, గుర్తుంచుకో. (1) ట్రంకు మేకులతో తాపటం చేసినది పనికిరాదు. మరమేకులతో బిగించినదిగా వుండాలి; (2) బూటు అడుగు భాగాన పనిముట్లు జాగ్రత్తచేసి తెచ్చుకోవాలి. (3) ట్రంకు లోంచి బయటకు వచ్చినతర్వాత మర మేకులను తిరిగి బెజ్జాలలో దూర్చాలి; (4) ట్రంకు తలక్రిందులు చెయ్యకుండా చూడాలి. (చివరి రెండు విషయాలూ చాలా ముఖ్యం. వీటిలో ఏది మరిచిపోయినా తేలికగా పట్టుబడిపోగలవు. జాగర్త!—

[పాఠకులు, ఈ గారడినిగురించి సలహాలను పొందదలిస్తే, వారు 'చందమామ' పేరు ఉదహరిసూ ప్రొఫెసరుగారికి వ్రాయవచ్చు. ఉత్తరాలు ఇంగ్లీములోనే వ్రాయాలి. వారి అడ్రసు యిది:—

ప్రొఫెసరు పి. సి. సర్కార్, మెజిషియన్,

పోస్టుబాక్సు 7878, కలకత్తా—12.]

# రోకంటి పాటలు

[సేకరణ : వడ్లమూడి గోపాలకృష్ణయ్య]

తమ్ముడా! తమ్ముడా! తలపోత వెలమ!
విష్ణుకథనామమ్ము వినర తమ్ముడ
రామకథ నానోమ్ము రార తమ్ముడ!

* * *

పినతల్లి కాళ్లవి ఓగువమట్టెల్లు
మేలైన కంసాలి నా మేనమామ

* * *

రామగిరి పోదాము రావె చెల్లెలా!
రామగిరి పట్నాన మనకెవ్వరక్కా?
మన అమ్మ తమ్ముల్లు మనకు మామల్లూ
ఉండారు కొండ్లాద రెండు లక్షలు.

* *

ఒకరి పచ్చాచూచి ఓర్వలేనోరికీ
తన మేలు దైవమ్ము తప్పజూచూను

* * *

శ్రీకృష్ణ వాకిట్లొ కుందనపు రోలు
శ్రీకన్య లిద్దరు తోడికోడళ్ళు-

* * *

ఇల్లాలు చచ్చినా యిల్లు కాలినా
కోటులు కలరాజు కోలుకోలేడు

* * *

పొద్దుపొద్దులు రెండు పొద్దాలు రెండు
పొదలమీదా తేటితుమ్మెదలు రెండు

* * *

ముచ్చటికిరాడన్న మొహమెత్తడన్న!
పచ్చని చెక్కిళ్ల పతి పలకడన్న!

పొద్దునె సూర్యుడు పొద్దున్నె రాగా
ఎల్ల చీరెలవారు ఎదురు నడిచేరు
పట్టు చీరెలవారు పారిపోయేరు

* * *

దొడ్డోన దోరావు తొంగి పడుకుంటే
దొంగల్ని కొట్టేరు ద్వారపాలకులు-

* * *

సీతాకాలపు చల్ల చిక్కన్ని చల్ల
పులిస్తే నాచేతి పూలవాసనలు
కవుతరంగవతయ్యా నీ నూతి నీళ్ళు
అల్లాలు బెల్లాలు తెనె తేటెల్లు-

* * *

ఆరెళ్ల అత్తైన పొరుగు పోరైనా
తల్లిల్లు దూరమైన భరియించలేము

* * *

చెట్టుకొట్టినతేళ మంచివేళైతె
పురుషుడికి పట్నమ్ము దేవికట్టించు

* * *

గుంటలో వడ్లోసి గుప్పిలడిగేను
గుళ్ళోను రామయ్య పూజ లడెగేను

* * *

మొక్కజొన్నల్లోది మొద్దురోకాలి
దెబ్బలారాకాసి పెద్దన్న వదిన

* * *

వడ్లు దంపినవారి ఓపికల్చెడును
ప్రజల నమ్మినవారి బ్రతుకులే చెడును-

51-వ పేజీలోని మాటల
చదరానికి జవాబు:

| | | | |
|---|---|---|---|
| 1 | వి | త్త | ము |
| 2 | జ | గ | ము |
| 3 | యు | శ | ము |
| 4 | న | గ | ము |
| 5 | గ | జ | ము |
| 6 | ర | వ | ము |
| 7 | ము | ద | ము |

49-వ పేజీలోని బొమ్మల
పజిలుకి జవాబు:

| అడ్డము : | నిలువు : |
|---|---|
| 1. అంగుళి | 1. అంగడి |
| 3. జలగ | 2. గుడి |
| 6. గడి | 4. లత |
| 7. తరి | 5. గరిటె |
| 8. మత్స్యము | 8. మగ్గము |
| 11. ముగ్గులు | 9. ముక్కాలు |
| 13. రవి | 10. అరక |
| 15. గంప | 12. అంపము |
| 16. కత్తులు | 14. విత్తు |
| 17. ఘటము | 15. గంట |

## "ఎందుకో తెలుసా?"



'వడ్రంగిపిట్ట ముక్కు చాలా పొడవుగా వుంటుంది. ఎందుకో తెలుసా?' అనే దానిని గురించి మాకువచ్చిన కథలలో కెల్లా ఉత్తమంగావున్న కథని ఈ సంచికలో వేశాం. దీనిని వ్రాసినది బి. చిన్నాజీరావు, విజయనగరం. బహుమతిగా వీరికి ఆరునెలలవరకు 'చందమామ' పంపుతున్నాము.



వచ్చేనెల (నవంబరు)కు
"లేడికి లేని కొమ్ములు దుప్పికి వున్నయ్" ఎందుకో తెలుసా?

అనే విషయాన్ని గురించి మీరు తెలుసుకుని ఒక చక్కటి కథ వ్రాసి పంపండి. రెండు పేజీలకు మించకుండా వుండాలి. కథలు అక్టోబరు 15-వ తేదీలోగా మాకు చేరేట్టు ఈ క్రింది అడ్రసుకు పంపండి.



"కథల తాతయ్య"
చందమామ ఆఫీసు
పోస్టుబాక్సు 1686, మదరాసు-1




బొమ్మకి రంగులు వెయ్యండి. మీరు రంగులువేసిన బొమ్మని వచ్చేనెల (నవంబరు) చందమామ అట్టమీది బొమ్మతో పోల్చుకోండి.

Controlling Editor : SRI CHAKRAPANI

Printed and Published by B. NAGI REDDI at the B. N. K. Press, Madras-1

